'ssued on 20-10-1957

VOL. V
No. 11




*30th July, 1957*
*(Tuesday)*

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES
# OFFICIAL REPORT

## Part II—PROCEEDINGS OTHER THAN QUESTIONS AND ANSWERS

CONTENTS



NOTE: *At the commencement of the speech denotes confirmation from the Member not received in time.

PRINTED BY AJANTA PRINTERS, SECUNDERABAD
FOR THE DIRECTOR, GOVERNMENT PRINTING PRESS
ANDHRA PRADESH, HYDERABAD.

1957

# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

*Forty-third Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Tuesday, the 30th July,* 1957.

The House met at Half Past Eight of the Clock

[ *Mr. Speaker in the Chair* ]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## CALLING ATTENTION TO MATTERS OF URGENT PUBLIC IMPORTANCE RE: PATASKAR REPORT

మిస్టర్ స్పీకర్ : 74 వ rule క్రింద తిరుత్తని విషయంలో నిన్న చెంగల్రాయ నాయుడుగారు అడిగినారు. ఇవ్వాళ వావిలాల గోపాలకృష్ణయ్యగారు వ్రాత మూలకంగా ఇచ్చినారు. Indian Express లో యీ విధంగా పడినదట్లు.

" A news item appeared in the Indian Express dated July 27, 1957, as the gist of the Pataskar Report stating that Tiruthani taluk was given to Madras and the claim of Hosur and Vepanapalli firkas in Madras State by Andhra was ignored."

జూలై 27 వ 'Gist of the Pataskar Report' అని Indian Express లో పడ్డది. ఆ విషయంలో ఇద్దరు సభ్యులు ఒకరు మూజు ఖాణి గాము, మరొకరు వ్రాతమూకలకంగాను అడిగారు. దాని విషయమై Chief Minister గారు ఏమైనా చెప్పడానికి ఇప్పటికి సిద్ధంగా ఉన్నారా ?

*The Chief Minister (Sri N. Sanjeeva Reddi)*: I have absolutely no information about this except what I read in the Press. The particular news is not published in all the papers but only in one or two newspapers which I think is more a speculation than anything else. We have not heard from the Government of India nor has Mr. Pataskar sent us anything.

మిస్టర్ స్పీకర్ : తమకు యేమీ రిపోర్టు రాలేదా ?

శ్రీ యన్. సంజీవరెడ్డి : ఏమీ రాలేదు.

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్ : "ఒక school విషయంలో telegram యిచ్చారని, ఒక పేరుపెడితే దానిని కాదని ఇంకొక పేరు పెట్టడానికి ప్రయత్నం చేశారని" జగన్నాథంగారు 74వ రూలుక్రింద నోటీసు యిచ్చారు. ఇది మంత్రిగారికి పంపిస్తాను. దాని విషయమై వారు ఆలోచించి న్యాయం చేస్తారు. అంతేకాని యిది adjournment motion కాదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి : అధ్యక్షా, నేను మీకు ఒకసలహా యిస్తున్నాను. ఇవన్నీ మీరు ఇక్కడ చదవడంవల్ల మాకు మీద్వారా వస్తున్నాయి. అట్లా కాకుండా direct గా మంత్రులకే పంపిస్తే సరిపోతుంది. Petition can be forwarded to the Ministers. It is useful.

మీద్వారా ఎన్ని పిటిషన్సు వచ్చినా నాకు అభ్యంతరం లేదు. 100 పిటిషనులు వచ్చినా తీసుకుంటాము. నాకేమీ ఆక్షేపణలేదు. కాని అనవసరముగా House యొక్క టైము పోతుంది. స్కూలుయొక్క పేరుమార్చడానికి కూడా స్పీకరుగారి ద్వారా రావలసినపని లేదనుకుంటాను.

మిస్టర్ స్పీకర్ : Adjournment Motion అని వచ్చినప్పుడు అది Adjournment Motion కాదని legal గా House లో చెబితే బాగుంటుందని చెబుతున్నాను.

ఉదయగిరి తాలూకాలోని చెరువులు తెగిపోయినాయని గౌ. సభ్యులు శ్రీ వెంకటరెడ్డిగారు యిచ్చారు. ఇది కూడా Adjournment Motion కాదు. మంత్రిగారికి చెప్పుకోవలసిన విషయమే.

మరొక సభ్యుడు మరీ vague గా ఇచ్చారు. భూములకు పట్టాలు యివ్వడం లేదు. పైనుండి క్రిందిదాకా corruption జరుగుతున్నదని శ్రీ రాజమల్లుగారు ఒక తీర్మానం యిచ్చారు. ఇటువంటివి అసెంబ్లీముందుకువచ్చే విషయాలు కావు.

## MESSAGE FROM THE GOVERNOR RE: ANDHRA PRADESH APPROPRIATION (No. 2). BILL, 1957.

*Mr. Speaker*: I am to announce the following message dated 28th July, 1957 received from the Governor of Andhra Pradesh:

"In pursuance of clause (1) of Article 207 of the Constitution of India, I, Chandulal Madhavlal Trivedi, Governor of Andhra Pradesh, hereby give my recommendation to the introduction in the Andhra Pradesh Legislative Assembly of the Andhra Pradesh Appropriation (No. 2) Bill, 1957, and in pursuance of clause (3) of the said Article, I also recommend to that Assembly the consideration of the said Bill.

## THE ANDHRA PRADESH APPROPRIATION (No.2) BILL, 1957

**The Minister for Finance (Dr. B. Gopala Reddi)*: Sir, I beg to introduce the Andhra Pradesh Appropriation (No. 2) Bill, 1957,* and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా, 3 వ తేదీన ప్రవేశపెట్టిన బడ్జట్ పైన జరుగుతున్న చర్చలన్నీ నేటితో సంపూర్తికాబోతున్నవి. 4 రోజుల general discussion, 16 రోజులు డిమాండులమీద జరిగిన చర్చలయొక్క సారాంశము ఈ Appropriation Bill ద్వారా ఈనాడు ప్రవేశపెట్టబడుతున్నది. 1950 వ సం.కు ముందు ఇటువంటి Appropriation Bill లేదు. Domands pass కాగానే గవర్నరుగారు certificate యిచ్చి pass చేసేవారు కాని కొత్తచట్టం వచ్చినతరువాత 1950 సం. నుంచి Appropriation Bill ఒకటి ఉండాలి. Act మాదిరిగా వుండాలి అనే ఉద్దేశ్యంతో Appropriation Bill వచ్చింది. దాని ప్రకారం ఈ 16 రోజులనుంచి demands మీద sanction అయిన మొత్తాలన్నీ ఈనాటి Appropriation Bill లో కనబడుతున్నాయి. కాని మొత్తాలు ఎక్కువగా కనబడుతున్నాయి. Treasury నుంచి తీసికొనే ప్రతి నయాపైస కూడా దీంట్లోకి రావలసివుంటుంది. 4 సార్లు 4 నయాపైసలు ట్రెజరీలో deposit చేసి 4 సార్లు తీసుకుంటే 4 నయాపైసల క్రింద లెక్కవేయాలిగాని, ఒక నయాపైసక్రింద లెక్కవేయకూడదు. అందువల్ల ఎక్కువగా నున్నట్లు కనబడుతుంది. "Every pie that is withdrawn from the treasury must be accounted for in the Appropriation Bill."

Charged items చాలాఉన్నాయి. గౌరవ సభ్యులకు తెలుసును. ప item మీద నైనా అయ్యే interest charged item. గవర్నరుగారి మీద అయ్యేఖర్చు charged item. HighCourt క్రింద అయ్యే ఖర్చు charged item. Speaker, Deputy Speaker ల జీతాలు, అలవెన్సులకు అయ్యే ఖర్చు charged item. ఇవన్నీ chared items క్రిందనే చూపించారు, ఈ 20 దినాలనుంచి జరుగుతున్న చర్చల

*Published on page 79 of the Andhra Pradesh Gazette dated 29th July, 1957.

ఫలితమే ఈ Appropriation Bill. దానిని అట్టేవిపులంగాచర్చించవలసినఅవసరం లేదు. కాబట్టి దానిని pass చేయవలసినదిగా సభవారిని కోరుతున్నాను.

*Mr. Speaker:* Motion moved.

ఇప్పుడు Appropriation Bill సభవారి యెదుటనున్నది. దానిపై general discussion మోస్తరుగా చర్చ జరుగదు. ముగ్గురు, నలుగురు సభ్యులు మాట్లాడడం, pass చేయడం తప్ప యింకొక పద్ధతిలేదు.

శ్రీ పి. సుందరయ్య (గన్నవరం) : ఈ Appropriation Bill పై ముగ్గురో, నలుగురో మాట్లాడాలని లేదు. Budget debate లో రానటువంటి అనేక విషయాలను గురించి, యిప్పుడు చర్చించి, ప్రభుత్వంయొక్క విధానాన్ని గురించి ఆలోచించి దానిని అంగీకరించడమా, లేదా అనే aspect దృష్టిలో పెట్టుకొని discuss చేయాలి. ఈ 20 రోజులనుంచి జరిగిన ఉపన్యాసాలను దృష్టిలో పెట్టుకొని దానిని sanction చేయడమా లేదా అనేది చూడడం పార్లమెంటరీ సాంప్రదాయం. ప్రభుత్వ విధానాన్ని గురించి పునరాలోచించడం, ఈ డబ్బును అంగీకరించడమా, లేదా అనే సమస్యను గురించి చర్చించడం, పార్లమెంటరీ సాంప్రదాయం. అందువల్ల ఈ విషయాలన్నీ చెప్పదలచు కొన్న వారు ఇద్దరుగాని ముగ్గురుగాని 10 మందిగాని మాట్లాడవచ్చు. ఇంకా మనకు మధ్యాహ్నం వరకు time కూడా ఉన్నది. కాబట్టి నామకః చర్చ కాకుండా చర్చ సాగించాలని నేను కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఇదివరకు Appropriation Bill రాగానే ఇద్దరో, ముగ్గురో సభ్యులు మాట్లాడడం, అంగీకరించడంతో సరిపోయేది. అలా కాకుండా మీరు oppose చేస్తామంటే అది వేరే సంగతి.

శ్రీ పి. సుందరయ్య: ప్రభుత్వంయిచ్చిన సమాధానాలను, అవలంబిస్తున్న విధానాలనుబట్టి ఈ బిల్లును పూర్తిగా వ్యతిరేకించాలని మా ఉద్దేశ్యం.

మిస్టర్ స్పీకర్ : అట్లా అయితే discussion వ్యవహారం వేరుగా వుంటుంది.

*శ్రీ ఆర్. నారాయణరెడ్డి (భువనగిరి) : అధ్యక్షా, ఈ 20 రోజులనుంచి Budget Session లో వివిధడిమాండులపై చర్చజరిగినది. మొత్తం చర్చను దృష్టిలోపెట్టుకొంటే ప్రతిపక్ష సభ్యులనుంచి, కాంగ్రెసు సభ్యులనుంచికూడా నిర్మాణాత్మకమైన సూచనలెన్నియో వచ్చినవి. కాని ప్రభుత్వవైఖరిలో మాత్రం మార్పువచ్చినట్లు యేమాత్రమూ కనిపించుటలేదు, మంత్రులిచ్చిన

ఉపన్యాసాలు వినినతరువాత ఈ విషయం స్పష్టమైనది. బడ్జట్ పైన మొట్ట మొదట ఆర్థికమంత్రిగారిచ్చిన ఉపన్యాసాన్ని పరిశీలించినట్లయితే వారు అవలంబించే ఆర్థిక విధానంలో ఏమాత్రమైనా మార్పుచేసేందుకు వారు సిద్ధంగాలేరని స్పష్టంగా తెలుస్తున్నది. ఈవిషయం వారేచెప్పారు. ప్రభుత్వంయొక్క ఆర్థిక విధానాన్ని బలపరచేందుకు, ఆదాయాన్ని పెంపొందించేందుకు సభ్యుల నుండి అనేక నిర్మాణాత్మకమైన సూచనలు వచ్చినాయి. మంత్రిగారుమాత్రం ఆ సూచనలవిషయమై ఆలోచించేందుకు సిద్ధంగాలేరని స్పష్టంగా తెలుస్తున్నది.

ఆ కారణంచేతనే మేము ఈ Appropriation Bill ను వ్యతిరేకించక తప్పడంలేదు. వ్యతిరేకించడం అనివార్యమవుతున్నదని స్పష్టంచేస్తున్నాను. చాలామంది సభ్యులు చాలా నిర్మాణాత్మకమైన సూచనలు చేశారు. మన రాష్ట్రంయొక్క ఆర్థికపటుత్వాన్ని పెంచేవిషయంలో, ఇంకాఎక్కువ వనరులు చేకూర్చేవిషయంలోకూడా నేను మంత్రిగారికి ఒక list ఇవ్వగలను. జీతాల తగ్గింపువిషయమైకూడా సూచనలు చేయబడినాయి. మంత్రిగారు దానివిషయమై ఏమీచెప్పలేదు. మంత్రుల జీతాలు తగ్గించడానికి, నైజాం భరణాలు తగ్గించడానికి అనేక సూచనలు చేయబడినాయి. ఆ సూచనలనుకూడా మంత్రిగారు అంగీకరించడానికి సిద్ధంగాలేరు. గవర్నరుగారి ఖర్చులవిషయంలో సుందరయ్యగారు చెప్పారు. కాని మంత్రిగారు ఆ సూచనలను అంగీకరించేందుకు మాత్రం సిద్ధంగాలేరు. దుబారాఖర్చులుతగ్గించే విషయంలో మంత్రిగారు ఒకఉపన్యాసం చేశారు. వారు ఆర్థికలోపాన్నెదుర్కొనడానికి ఒక motor car ను కొనడంలేదు అనే విషయాన్ని చెప్పారు. గాని దానినిగురించి ఏమిచర్యలు తీసుకోబోతున్నారో, ఏవిధంగా దుబారాఖర్చును తగ్గించబోతున్నారో, దానిని గురించి ఒక ప్లాన్‌ను సభముందు పెట్టలేదు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకాలంనుండి ఉన్న పుగాకు పరిశ్రమను జాతీయం చేసినట్లయితే ఈనాడు చాలాడబ్బు వచ్చే అవకాశం ఉన్నదని సభ్యులు నిర్మాణాత్మకమైన సూచనలు చేశారు. భాగ్యవంతులపై హెచ్చుపన్నులు వేయాలని, పేదవారికి సహాయంచేయాలని, చిన్నఉద్యోగులకు, బడిపంతుళ్ళకు జీతాలు పెంచాలని, చాలమంది సభ్యులు చెప్పారు.

తరువాత ఈ విషయంలో కేంద్రంనుంచి ఎక్కువగా డబ్బు రాబట్టుకొనవలెననేదాన్నిగురించి శ్రీ సుందరయ్యగారు నొక్కిచెప్పారు, అయినప్పటికి ప్రభుత్వం ఈ సూచనలు అంగీకరించేందుకు ఏమాత్రం సిద్ధంగాలేదని నేను అనుకొంటున్నాను. మంత్రిగారు ఏ పన్నులు అయితే వెయ్యాలనుకొంటున్నారో వాటినిగురించి నిర్ణయాలు జరుగుతున్నట్లు ఇవాళ పత్రికలో చదివాం. ఇంకా వివరాలు చదవలేదు అనుకోండి. మొత్తంమీద హెడ్‌లైన్సులో ఆ విధంగా

ఉంది. అయితే సభ్యులను నిర్మాణాత్మకమైన సూచనలు యివ్వమని, ఎందుకు అడుగుతున్నారో నాకు అర్థం కావడంలేదు. ఈ విషయంలో ప్రతిపక్షసభ్యులే గాదు, కాంగ్రెసుసభ్యులుకూడా అనేక నిర్మాణాత్మకమైన సూచనలు చేశారు. అంతేగాదు. ఈ బడ్జెట్ చర్చలు జరిగేటప్పుడు కొన్ని విషయాలు నా దృష్టికి వచ్చినవి. ముఖ్యంగా ఆర్థికమంత్రిగారి దృష్టికి ఒక విషయం తీసుకరాదలచాను.

పొదుపు ఉద్యమం సాగించాలని చాలామంది సభ్యులు సూచించారు. కాని ఆ విషయంలోమాత్రం ప్రభుత్వానికేమీ పట్టినట్లు కన్పడడంలేదు. ఈ మధ్య కొన్నివార్తలు పత్రికలో వచ్చాయి. కర్నూలులో ఒక మెడికల్ కాలేజి తెరువబడింది. అయితే దానికి ఎంత ఖర్చుఅయినదో నాకు తెలియదు. బహుశః ఆర్థికమంత్రిగారికి ఆ వివరాలు తెలియవనుకుంటాను. తరువాత అక్కడకు Central Finance Minister గారు వచ్చారని, వారికి ఢిల్లీనుండి ఒక ఛార్టర్డుప్లేన్ అక్కడకు రావడానికి ఏర్పాటు చేయబడిందని అనుకొంటున్నారు. అయితే యిది ఎంతవరకు యదార్థమో నాకు తెలియదు. పత్రికలో చూచినవిషయం చెప్పాను. ఒకవేళ నిజంకాకపోతే తరువాత మంత్రిగారు చెప్పవచ్చు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : దానిఖర్చు మన గవర్నమెంటుకేమీ సంబంధం లేదు. దానికయ్యేఖర్చు అంతా Indian Air Force వారే భరిస్తారు. ఆ ప్లేన్‌ను కొన్నిగంటలు నడపాలని ఉంటుంది. కనుక ఆ విషయం వాళ్ళకు, వాళ్లకు సంబంధించిందేగాని మనకేమీ సంబంధంలేదు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : అయితే పత్రికలలో వచ్చిందేమంటే ప్రొవిన్షియల్ గవర్నమెంటే ఖర్చుపెట్టి ఆచార్టర్డు ప్లేనును తెచ్చిందని ఇక్కడ నుండి వారు special train లో కర్నూలుకు వెళ్ళారని, అక్కడ విపరీతమైన డబ్బు ఖర్చు అయినదని, ఈ విషయాలన్నీ తెలిసినవి. అందువలననే ఈ విషయాన్ని మంత్రిగారిదృష్టికి తీసుకొస్తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : Special train కొరకైన అయ్యేఖర్చు మన గవర్నమెంటుదే. ఎందువల్లనంటే ఇప్పుడు night trains తీసేశారు. ఉదయం 6 గం॥ train ఉంది. అది మధ్యాహ్నం 2, 3 గంటలకు కర్నూలుకు పోతుంది. ఉదయమే function చేసుకోవలసియున్నది. ఇంకా M. L. As., ఇతర ఉద్యోగులు చాలామంది రావలసినవాళ్ళు ఉన్నారుగనుక, Railway వాళ్ళు పూర్తిగా accommodation యివ్వలేకపోయిన కారణంచేత special train వేయవలసి వచ్చింది.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి :పది ఎటులున్నా ఉన్న విషయాన్ని చెప్పాను. ఇంతకూ సభ్యుల నుంచి పోదుపుఉద్యమాన్ని గురించి ఎంత నిర్మాణాత్మకమైన సూచనలు వచ్చినా వాటినిగురించి మాత్రం ప్రభుత్వం ఏమాత్రం శ్రద్ధతీసుకోడం లేదు. అయితే మంత్రులు కొత్త కారులు కొనుక్కోకపోయినంత మాత్రాన ఈ ఉద్యమం జయప్రదమవుతుందని నే ననుకోవడంలేదు. ముందు ప్రభుత్వ యంత్రాంగంలో మూలమూలలా, ఎక్కడెక్కడ లోపాలున్నవో వెదకవలసి యున్నది. అందుకు ఒక ఉదాహరణగానే ఈ విషయాన్ని చెప్పాను. పొదుపు ఉద్యమాన్ని గురించి ఒక స్పష్టమైన ప్రకటన గాని, scheme గాని యింతవరకు మంత్రిగారు House ముందు పెట్టలేదు.

సుందరయ్యగారి ఉపన్యాసానికి జవాబుగా ముఖ్యమంత్రిగారి ఉపన్యాసం కొంత రాజీధోరణిలో ఉన్నప్పటికీ, తక్షణమే ప్రభుత్వానికి ఆదాయంవస్తుందని చెప్పడానికి అవకాశంలేదు. శ్రీ సంజీవరెడ్డిగారి జవాబు నిజంగా post dated cheque లాంటిది. దానికి ఎన్నో 'ifs' and 'buts' వుంటాయి! ఇప్పుడున్న పరిశ్రమలన్నీ సక్రమమైన management తో ముందుకు సాగినట్లయితే ఎప్పుడో ముందు వచ్చే లాభమే గాని, ఈనాడు తక్షణం దానికి చేయవలసిందేమీ లేదు. అందువల్లనే దాన్ని నేను post dated cheque అంటున్నాను. ఈ 'ifs and buts'ను దాటితే ఏమి జరుగుతుందో చెప్పలేము.

ఇక industries గురించి చూచినప్పుడు గతాన్ని గురించి వారికేమీ బాధ్యత లేదు గనుక వారు యితరుల గురించి బాగానే చెబుతారు, దానివల్ల లాభమేమీ లేదు. అయితే ఈనాటి మన ఆర్థికవిధానం చూచినప్పుడు ఒక స్పష్టమైన picture మన ముందుకు వస్తుంది. మనరాష్ట్రం ఈనాడు ఆర్థిక సంక్షోభంలో మునిగిఉన్నదనేది మాత్రం చాలా స్పష్టం. ఇటువంటి పరిస్థితిని లేకుండాచేసేందుకు House లో చాలావరకు నిర్మాణాత్మకమైన సూచనలు చేయబడినప్పటికి, వీటన్నింటినీ అమలువరచేందుకు మాత్రం ప్రభుత్వం సిద్ధంగా లేదని నేను భావిస్తున్నాను. అయితే ఆర్థికమంత్రిగారు తమ ఉపన్యాసంలో taxation గురించి ఏవైతే సూచనలు చేశారో వాటినిమాత్రమే అమలువరచేందుకు సిద్ధంగా ఉన్నారు. వారి విధానంలో ఏమాత్రం మార్పువచ్చినట్లు నేను అనుకోవడంలేదు. కాని శాసనసభ్యులు చేసిన సూచనలు గౌరవించి, అందులో ఒక్కటి కూడా అంగీకరించడానికి ప్రభుత్వం సిద్ధంగాలేదనేది మాత్రం చాలా శోచనీయమైన విషయం. అంతేకాదు; అసెంబ్లీలో చర్చలు జరుగుచున్నప్పుడు మంత్రివర్గం కొందరిగురించి కొన్ని బెదరింపులు కూడా చేసింది. ఈనాడు బడి పంతుళ్ళు తమకు చాలా తక్కువ జీతంవస్తున్నదని ఒక ఉద్యమాన్ని నడుపుతున్నారు. వారి సంఘంతరఫున తమ కష్టపరిస్థితులన్నీ ప్రభుత్వానికి తెలుపు

తున్నారు. అయితే దానికి జవాబుగా విద్యామంత్రిగారు యిచ్చిన జవాబులో కొన్ని విషయాలను సభ్యులముందు పెట్టదలచుకున్నాను. వారిని బెదిరించి, వారి సంఘాలను నిషేధించి, వారిని ఆ సంఘాలలో చేరకుండా చేసేందుకు ఒక G.O. pass అయిందని ఆ G. O. ను పంపించారని వారు చాలా గట్టిగా House లో చెప్పారు. అయితే అది fundamental rights కు పూర్తిగా వ్యతిరేకమనే సంగతి నేను వారికి వేరేచెప్పవలసిన అవసరం లేదు. భారత రాజ్యాంగ చట్టానికి కూడా వ్యతిరేకమనే విషయం మరొకసారి చెప్పవలసిన అవసరంలేదు. దానికి సంబంధించిన Constitution యొక్క Article చదివి వినిపిస్తాను. ఎందుకంటే - మంత్రిగారు ఈ చర్చలలో మరొక విషయంకూడా చెప్పారు. High Court ఆ విషయంపై Judgment యిచ్చిందని అన్నారు. ఆ High Court యొక్క Judgment యేమో నాకు తెలియదు. ఆ wording ఏమిటో విన్న తరువాత, మంత్రిగారు యిచ్చిన జవాబు 'contempt of court' అవుతుందా? అనే విషయం ఆలోచించవలసి యున్నది. ముఖ్యంగా మంత్రిగారు చెప్పిన మాటలు మాత్రం భారత రాజ్యాంగ చట్టానికి పూర్తిగా వ్యతిరేకమని చెప్పక తప్పదు.

Art. 14 of the Constitution ను నేను చదివి వినిపిస్తాను. Right to freedom అన్న title క్రింద—

"All citizens shall have the right—

(a) to freedom of speech and expression;

(b) to assemble peaceably and without arms;

(c) to form associations or, unions;"

... ... ...

అంతవరకు చాలు అనుకుంటాను. మిగతా fundamental rights కూడా అందులో నిర్వచించబడి యున్నవి. నేను ఈనాడు ప్రభుత్వాన్ని ఒక ప్రశ్న అడగదలచుకున్నాను. మంత్రిగారు చెప్పింది అది వారి స్వంత అభిప్రాయమా? లేక మంత్రివర్గము యొక్క అభిప్రాయమా? నేను మాత్రం అది మంత్రివర్గం యొక్క అభిప్రాయమే అనుకుంటున్నాను. నా ప్రశ్న ఏమంటే, 'all citizens' అనే పదాలు Constitution లో వున్నాయి. అయితే పంతుళ్ళు 'citizens' అవునా; కాదా? అనేది చెప్పవలసియున్నది. మంత్రిగారు కూడా ఒక విషయం చెప్పారు. 'నేను కూడా ఈ Constitution ను గౌరవిస్తున్నానని' చెప్పారు, అయితే వారు ఏదైతే House లో చెప్పారో అది మాత్రం Constitution ను గౌరవించడం ఏ మాత్రం కాదని నేను స్పష్టంగా చెప్పకతప్పదు.

దానికి కొన్ని రెస్ట్రిక్షన్సు ఉన్నాయి. సిటిజన్సు కూడా ఈ హక్కును వినియోగించుకొనే విషయంలో కొన్ని రెస్ట్రిక్షన్సు ఉన్నాయి.

Art. 19 (1) All citizens shall have the right—

(a) to freedom of speech and expression ;

(b) to assemble peaceably and without arms ;

(c) to form associations or unions ;

... ... ...

Sub-clause (4): Nothing in sub-clause (c) of the said clause shall affect the operation of any existing law in so far as it imposes, or prevent the State from making any law imposing, in the interests of public order or morality, reasonable restrictions on the exercise of the right conferred by the said sub-clause.

దీనిలో రీజన్‌బుల్ రెస్ట్రిక్షన్సు కొన్ని ఉద్దేశ్యములతో మాత్రమే వారు పెట్టడానికి అవకాశం ఉన్నది. చట్టం చేసే అవకాశం ఉన్నది. దానిలో అది స్పష్టంగా నిర్వచింపబడినది. ఏదైనా ఉద్యోగము, ఏదైనా సంఘము పబ్లిక్ ఆర్డర్సుకు భంగకరముగా ఉన్నట్లయితే, ప్రజలశాంతికి భంగకరముగా ఉన్నట్లు అయితే, లేక వీటికి భంగకరముగా ఉన్నట్లయితే కొన్ని రెస్ట్రిక్షన్సు, రీజనబుల్ రెస్ట్రిక్షన్సు పెట్టే అవకాశము కాన్‌స్టిట్యూషన్ ఇస్తున్నది. ఐతే ఇప్పుడు పంతుళ్ళు శాంతికి భంగకరంగా ప్రవర్తించారా అని అడుగుతున్నాను. వారి ఉద్యమాన్ని పరిశీలిస్తే శాంతికి భంగకరముగా వారు ఇంతవరకూ ప్రవర్తించ లేదు. వారువారి జీతాలు పెంచమని ఆందోళన చేస్తున్నారు. వారికి చాలతక్కువ జీతాలు దొరకుతున్నాయి. అందువలనవారు ఆందోళనచేస్తున్నారు. అదిదేనికినష్ట కరమని మంత్రిగారు భావిస్తున్నారు? శాంతికిభంగకరముగా ప్రవర్తించినారా? లేక నీతికి వ్యతిరేకంగా వర్తించారా? కాని ఇప్పుడు మంత్రిగారు చేసే బెదిరింపులు, మంత్రిగారిచ్చే అభిప్రాయము ఎందువల్ల వచ్చాయి. వారు ఒక జీ.వో. ను పాస్ చేశారు. అది కాన్‌స్టిట్యూషన్‌కు వ్యతిరేకం. కొన్నిలతల రూపాయలు మాత్రమే మిగుల్చుకొనడానికి వారు కాన్‌స్టిట్యూషన్‌కు వ్యతిరేకంగా పోతున్నారనేది చాలా స్పష్టంగా కనబడుతున్నది. ప్రభుత్వమువారు పంతుళ్ళ విషయంలోనే కాదు, గ్రామోద్యోగుల విషయంలో కూడా బెదిరింపులు చేశారు. గ్రామోద్యోగులు యీనాడు తమ జీతాలు ఎక్కువ చేయమని ఆందోళనచేస్తున్నారు. ఐతే దానిని బెదిరింపులతో అణచివేసి వారి సంఘాలలో చీలికలు కల్పించి లొంగదీయడానికి ప్రయత్నిస్తున్నారు. లొంగదీయవచ్చును. ప్రభుత్వం దగ్గర అటువంటి శక్తి ఉండవచ్చు. ఐతే దాని పరిణామం ఏ విధంగా ఉంటుందో ఆలోచించమని నేను మనవిచేస్తున్నాను. ముఖ్యంగా ఏ మధ్య తరగతివారు

కాంగ్రెసు సంస్థకు అండగా ఉంటూ ఉండినారో వారు యీనాడు అసంతృప్తి చెందినారు. దాని పరిణామము ఏ విధంగా ఉంటుందో ఆలోచించవలెనని కోరుతున్నాను. కళా వెంకట్రావుగారు చెబుతూ కేరళ ఉదాహరణ తీసు కొచ్చారు. ట్రావెన్కూరు - కొచ్చిన్‌లో ఉండే పరిస్థితిని చెప్పారు. యదార్థ మేమిటంటే ట్రావెన్కూరు - కొచ్చిన్‌లో కేరళ ప్రభుత్వం జీతాలు పెంచనే లేదు. అక్కడ ఇదివరకే ఆజీతాలున్నాయి. అక్కడ పెంచినది లేదు. మలబారు జిల్లాలో మాత్రమే పెంచారు. మలబారుజిల్లాలో ప్రస్తుతము మద్రాసులోనూ, ఆంధ్రలోనూ ఉన్నట్లుగా ఉంది. ఈ విషయాన్ని చెప్పిన కేరళలో మంత్రివర్గంవద్ద నుంచి ఏదో టెలిగ్రాం వస్తే అది తిరువాన్కూరు కొచ్చినులోని విషయాలని వారు హౌసుముందర పెడుతున్నారు. కాని మలబార్ సంగతి వారు హౌసు ముందరపెట్టలేదు. తిరువాన్కూరు-కొచ్చిన్‌లో ప్రభుత్వం ఈ జీతాలున్నాయి. మలబారులో కూడ ఇతర కేరళ ప్రాంతాలలోవలె ఒక స్థాయికి తీసుకొని వచ్చారు. ఈ విషయాన్ని చెప్పక ఒకరకంగా మభ్యపెట్టడానికిగాను వారికి అనుకూలమైన జవాబులు ఇవ్వడం జరిగింది. అది సక్రమమైన పద్ధతికాదని స్పష్టంగా చెప్పక తప్పదు. యన్. జి. ఓస్. కూడా జీతాలను హెచ్చుచేయమని ఆందోళన చేస్తున్నారు. వారినిగురించి బెదరింపు రాలేదు. కాని, ఆ డిమాండుపై చర్చ సందర్భంలో ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ చాలా అన్యాయంగా చెప్పారు. ఈ విషయము ఇదివరకు కూడా మనవిచేశాను. యన్. జి. ఓస్. విషయములోకూడ సక్రమమైన పద్ధతిని ఆలోచించాలి. సభ్యులు చేసిన సూచన లన్నీ అంగీకరించినట్లయితే ఇవి చేయడానికి అవకాశం ఉంటుంది. అది ఇంతకు పూర్వం కూడా చెప్పాను. ఇప్పుడుకూడ చెబుతున్నాను.

విద్యాశాఖమంత్రిగారు ఇచ్చిన ఇంకొక అభిప్రాయం నాకు చాలా ఆశ్చర్యాన్ని, షాక్‌ను కలిగించింది. అది కాలేజీలలో బోధనా భాషనుగురించిన అభిప్రాయం, చాలా రియాక్షనరీ అభిప్రాయాన్ని వారు చెప్పారు. కాలేజీలలో ఇంగ్లీషు ఉండాలని వారు బల్లగుద్ది చెప్పారు. నాకు అది అర్థంకాలేదు. యీ సిద్ధాంతాన్ని యీ విద్యాశాఖమంత్రిగారు ఎక్కడనుంచి సంపాదించారో నాకు అర్థంకాలేదు. అంతేకాకుండా విద్యావేత్తలందరిలో కూడా ఆ విషయంలో ఏమాత్రం అభిప్రాయభేదంలేదు. కాలేజీ తరగతులలో ఇంగ్లీషు బోధనా భాషగా ఉండవలెనా, లేక ఏదైనా భారతదేశ భాష బోధనా భాషగా ఉండ వలెనా అనేదానితో అభిప్రాయభేదంలేదు. డాక్టర్ రాధాకృష్ణన్‌గారి అధ్యక్ష తను జరిగిన యూనివర్శిటీ ఎడ్యుకేషన్ కమిషన్ వారి రిపోర్టులోనుంచి ఆ భాగాన్ని చదివి వినిపిస్తాను :

"Objections to English: It is educationally unsound to make a foreign tongue the means of acquiring knowledge. Dr. Hans, Lecturer in Comparative Education in the London University, points out in his recent book the serious drawbacks in adopting a foreign language as a medium of instruction. He says, "before entering school the pupils have acquired a proficiency in their mother tongue, have built up a vocabulary covering most of the objects of sense impressions and their daily activities. At school they have to superimpose on this basis a language of ideas and abstract relations, expressed entirely in a foreign medium. Their minds become split into two water-tight compartments, one for ordinary things and actions expressed in their mother tongue, and another for things connected with school subjects and the world of ideas expressed in a foreign language. As a result they are unable to speak of their home affairs in the school language and about learned subjects in their mother tongue." దానిని వారు స్పష్టంగా చెప్పారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : ఇంగ్లీషు అక్కరలేదని ఇంగ్లీషులోనే చాలా దీర్ఘంగా చదువుతున్నారు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : లైబ్రరీలో ఇది తెలుగులో ఉన్నట్లయితే తెలుగులోనే నేను చదివేవాడిని. లైబ్రరీలో ఇంగ్లీషులోఉన్న రిపోర్టు తెచ్చారు. దయచేసి ఫైనాన్సు మినిష్టరుగారు డబ్బు ఇచ్చి యీ రిపోర్టును తెలుగులోనికి తర్జుమా చేయించినట్లయితే నేను దానిని తెలుగులో చదివేవాడను,

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) : డబ్బు అవుతుందని ఇంగ్లీషులోనే ఉంచుతారా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి : ఇంగ్లీషు వద్దని ఇంగ్లీలోనే చెప్పండి.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : ఈ అభిప్రాయం విద్యాశాఖ మంత్రిగారికి ఎక్కడనుంచి వచ్చినదో నాకు తెలియదు, మీడియం ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్ ఇంగ్లీషులోనే ఉండాలనే అభిప్రాయం ఎక్కడనుంచి సంపాదించారో నాకు తెలియదు. కేంద్ర ప్రభుత్వం యొక్క అభిప్రాయాలే కాకుండా మంత్రిగారి వ్యక్తిగత అభిప్రాయమూ లేక మంత్రివర్గము యొక్క అభిప్రాయమూ అనేదినాకు అర్థం కావడంలేదు. ఇది చాలా పాత అభిప్రాయం అనుకుంటున్నాను. చాలా కన్‌సర్వేటివ్ అభిప్రాయం. చాలా రీ యాక్షనరీ అభిప్రాయమని అనుకొంటున్నాను. ఈ రిపోర్టులో ఇంకో విషయంకూడా స్పష్టంగా చెప్పారు, ఇంగ్లీషును ఏది రీప్లేస్ చేయాలనే విషయం చాలా స్పష్టముగా చెప్పారు. ఇంగ్లీషును రీప్లేస్ చేసేది హిందీ కాదని కూడా స్పష్టంగా చెప్పారు. ఇంగ్లీషును రీప్లేస్ చేసేది

అక్కడవుండే ప్రజలయొక్క మాతృభాష అని అదే రిపోర్టులో స్పష్టంగా చెప్పారు. ఐతే మంత్రిగారికి మీ అభిప్రాయం ఎక్కడనుంచి వచ్చినదో నాకు అర్థం కావడంలేదు. మేము హిందీకి వ్యతిరేకులం కాము. ఇంగ్లీషుకు కూడా వ్యతిరేకులము కాము. అదికూడా నేను మనవి చేస్తున్నాను గోపాలరెడ్డిగారితో, ఇంగ్లీషు నిజముగా అంతర్జాతీయభాష. ఐతే ఇంగ్లీషు ఒక్కటేకాదు. ఇంకా అంతర్జాతీయ భాషలున్నాయి. మనము సైన్సులో అభివృద్ధి చెందుటకు చాలా ప్రావీణ్యత సంపాదించుటకు ఇంగ్లీషు అవసరమే. ఇతర అంతర్జాతీయ భాషలు కూడా మనము నేర్చుకోవాలి. ఏ దేశములలో ఏ శాస్త్రము బాగా అభివృద్ధి చెందినదో ఆ భాషలను కూడా నేర్చవలెనంటే నేరుస్తాము. కొన్ని పుస్తకాలు ఇంగ్లీషులో ఉండవచ్చు. కొన్ని జర్మన్ భాషలో ఉండవచ్చు. కొన్ని రష్యను భాషలో ఉండవచ్చు, కొన్ని చైనీస్ భాషలో కూడా ఉండవచ్చు.

డాక్టరు బి. గోపాలరెడ్డి : కొన్ని పరిష్యను భాషలోకూడా ఉండవచ్చును.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : ఇది ఇంగ్లీషుకు వ్యతిరేకమనే సమస్యకాదు. యీనాడు మన మాతృభాష స్థానము ఇంగ్లీషు ఆక్రమించవలెనా, హిందీ ఆక్రమించవలెనా అనేదే సమస్య. అది సాధ్యంకాదు వారు ఎంత ప్రయత్నించినా. మంత్రిగారు చరిత్రకు ఎదురు ఈదుతున్నారనీ, వారు గ్రహించవలసినదనీ కోరుతున్నాను. మేము హిందీకి కూడా వ్యతిరేకులము కాము. హిందీ రాష్ట్రభాషగా ఉండాలి. ప్రజలు హిందీ నేర్చుకోవాలి. ఇంటర్ ప్రావిన్షియల్ కమ్యూనికేషన్సుకు హిందీ అవసరము. సెంట్రల్ సర్వీసెస్‌లో ఉండేవారికి హిందీ అవసరము ఉంటుందేకాని యీనాడు కాలేజీ భాష విషయంలో సెంట్రల్ గవర్నమెంటు కూడా స్పష్టముగా ఒక పాలసీని అవలంబించలేదు. ఒక అస్పష్టమైన పరిస్థితిలో అక్కడ వదలిపెట్టినారు. ఇంగ్లీషును రీప్లేస్ చేయాలని అంటారు. ప్రభుత్వం యొక్క ప్రొనౌన్సుమెంట్సు ఉన్నాయి. ప్రైమ్ మినిష్టరుగారి ప్రొనౌన్సుమెంట్సు ఉన్నాయి. కాని దాని స్థానము ముఖ్యముగా రాష్ట్రములలోనే కాలేజీ తరగతులలో మీడియమ్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్సులో విషయంలో ఇంగ్లీషు స్థానాన్ని ఏది ఆక్రమించాలనే దానిలో భేదాభిప్రాయాలున్నాయి. కేంద్రంలో ఒకరు హిందీ కావాలని అంటున్నారు. ఇంగ్లీషు కావాలంటే వారు అపహాస్యం చేస్తారు. వీరు ఇంగ్లీషు కావాలంటున్నారు కాని హిందీ అంటే అంగీకరించడానికి సిద్ధంగా లేరని అపహాస్యం చేస్తారు. అందుకొరకు ఒక స్పష్టమైన పాలసీని అవలంబించవలసిన అవసరమున్నది ఉస్మానియా యూనివర్శిటీలో పెద్ద ఎక్స్‌పెరిమెంటు చేశారు. అది మంచి ఎక్స్

పెరిమెంటు. ప్రజల డబ్బు ఎంత వృధా చేశారు అనేది అలా వదలిపెట్టి ఉస్మానియా యూనివర్శిటీ మొదటి పర్యాయము కాలేజీ తరగతులలో భారతదేశపు భాషలలో ఒక దానిని ప్రవేశపెట్టారు. ఆ ఎక్స్‌పెరిమెంటును తెలుగులోనికి మార్చమని నేను మంత్రివర్గాన్ని కోరుతున్నాను. అప్పుడున్న హైదరాబాదు ప్రభుత్వం ఒక విషయాన్ని చాలా స్పష్టంగా పెట్టినది. ఇంగ్లీషుకు బదులుగా ఒక భారతదేశపు భాషను ఉరుదును కాలేజీ తరగతులలో బోధనా భాషగా చేసింది. ఉర్దూ భారతదేశము యొక్క భాషగానే నేనే పరిగణిస్తాను. ఉర్దూ మీడియమ్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షనుగా ఉండాలని ఒకమంచి ఎక్స్‌పెరిమెంటు చేశారు. దానిలో ఎంతో దుబారా ఖర్చు అయినది. ట్రాన్సు లేషనుకు పేజీకి 10 రూపాయలు ఇచ్చారు. దానిని నేనిపుడు విమర్శించడంలేదు. ఐతే దానిలో ఒక సిద్ధాంతం మాత్రమున్నది. హైదరాబాదులో అప్పుడుకూడా తెలుగువారు చాలా బాదలు పడేవారు. ఒక నారాయణగూడ హైస్కూలులోనే, మాడపాటి హనుమంతరావు హైస్కూలులో మాత్రం మీడియమ్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్ తెలుగు లోనే ఉండేది. కాని ఇతరచోట్ల ప్రయిమరీలో కూడా లేకుంటే దానివల్ల ఎంతో బాధపడవలసి వచ్చేది.

నైజాము ప్రభుత్వంతో సంప్రతింపులుచేసి హైస్కూలువరకూ తెలుగును పెట్టమని అడిగినా వారు నిరాకరించారు. ఐతే ఇప్పుడు యీ అభివృద్ధి నిరోధక మైన అభిప్రాయం మంత్రివర్గానికి ఉన్నట్లయితే తప్పకుండా పునరాలోచించాలని వారిని కోరుతున్నాను. ఈనాడు కాలేజీలలో ఇంగ్లీషా, ఉర్దూ ఆ, లేక మాతృభాషలో చెప్పవలెనా అనేది పెద్ద సమస్యగా వస్తున్నది. దానికి మంత్రి గారు ఒక పరిష్కారము కనుగొనాలి. మంత్రిగారు కాలేజీ తరగతులలో ఇంగ్లీషు బోదనా భాషగా ఉండాలని ఒక ప్రిన్సిపులుగా చెప్పారు. అదే నాకుండే ఆక్షేపణ. "తాత్కాలికంగా మేము తీసుకునిరాలేము, మాకు ప్రాక్టికలు డిఫికల్టీస్ ఉన్నాయి" అని అంటే అది వేరువిషయము. వారు దానిని ఒక ప్రిన్సిపులుగా ఇంగ్లీషు ఇంటర్‌నేషనల్ లాంగ్వేజి కనుక అది మీడియమ్ ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్ భాషగా ఉండాలని వారు చెప్పినారు. అది చాలా క్లిష్టసమస్య. దానినిగురించి మంత్రిగారు పునరాలోచిస్తారని నేను భావిస్తున్నాను.

వ్యవసాయ సంస్కరణలు గురించి చెప్పవలసి వస్తే, అవి మాకు ఎండ మావులు అయిపోయినాయి. వస్తాయి, వస్తాయి, అని ఇదివరకు ఆశిస్తూనే ఉన్నాము. దాదాపు ఒక సంవత్సరం నుంచి మంత్రులు pronouncements చేస్తున్నారు. ఇక వస్తుంది, ఇక వస్తుంది అని చెపుతున్నారు. కాని ఇంతవరకు ఏమీ కన్పడలేదు. మొన్న శ్రీ కళావెంకటరావుగారు పత్రికా ప్రకటనచేస్తూ నా duty నేను చేస్తున్నాను, ఈ Session లోనే ఒక Memorandum ప్రవేశపెడు

తున్నానని అన్నారు. కాని అదికూడా వచ్చినట్లు లేదు. ఎందుకంటే రేపటితో ఈ Session ముగుస్తుంది. Last but one day లో ఉన్నాము. కనుక ఈ Session లో ఆ మెమొరాండం discussion కు వస్తుందని ఆశించే అవకాశము లేదు. ఇక అది ఎప్పుడు వస్తుందో తెలియదు. ఆ విషయంలో ఎక్కువగా చెప్ప వలసిన అవసరం లేదు అనుకొంటాను. చాలామంది సభ్యులు ఈ విషయం గురించి ఇదివరకే మాట్లాడినారు.

ఇంకొక్క విషయంమాత్రం మంత్రిగారి దృష్టికి తీసుకు రాదలచు కొన్నాను. ఈ మధ్యన ఆంధ్ర, తెలంగాణాలలో అభిప్రాయభేదాలు చాలా తీవ్రంగా చెలరేగుతున్నాయి. బజార్లలో అంతటా, సిటీలో అంతటా ఈవిషయం గురించి చాలా తీవ్రంగా మాట్లాడు కొంటున్నారు. ఈ మాటలలో కొంత యదార్థము ఉండవచ్చును. కొంత exaggeration కూడా ఉండవచ్చును. కనుక మంత్రిగారు చక్కగా ఆలోచించి ఏవైనా పొరపాట్లు జరుగుతూ ఉంటే, వాటిని సరిదిద్దేందుకు ప్రయత్నించవలెనని, exaggeration ఏదైనా ఉంటే అది లేదని చెప్పేందుకు ప్రయత్నించవలెనని కోరుతున్నాను. తరువాత ఈ ప్రాంతా నికి safeguards ఇచ్చేటందుకు గాను ఒక Regional Committee నియమించ డానికి ఒక మంత్రివర్గము అంగీకరించిందని నిన్ననే నాకు తెలియవచ్చింది, అది కేంద్రముయొక్క మంజూరుకొరకు వెళ్ళిందని తెలుస్తున్నది. త్వరగా కేంద్రము నుంచి మంజూరు తెప్పించి దానిని ఏర్పాటు చేస్తే ఈ అభిప్రాయభేదాలు పోవడానికి అవకాశముంటుందని, తీవ్రముగా వ్యాపిస్తున్న ఈ వార్తలయొక్క సత్యాన్నికూడ తెలుసుకొనేందుకు వీలుంటుందని మనవి చేస్తున్నాను. విశా లాంధ్రకొరకు మేమంతా చాలా ఆందోళనచేస్తూ ఉంటిమి. కాబట్టి కనీసం ఆ Regional Committee ని స్థాపించినట్లయితే దాంట్లో అన్నివిషయాలు ముఖా ముఖి చర్చించే అవకాశము ఉంటుందని భావిస్తున్నాను. దానిద్వారా పొర పాట్లు ఏవైన ఉంటే వాటిని సవరించి నిజమైన ఐక్యతను నెలకొల్పేందుకు మంత్రివర్గము, సభ్యులందరుకూడ ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను.

చివరకు, ఒక్క విషయం మంత్రివర్గానికి చెప్పదలచుకొన్నాను. ఈ బడ్జెటు సెషనులో మంత్రివర్గముయొక్క ప్రవర్తన, వారి ఉపన్యాసాలధోరణి, వీటి స్వరూపము మాత్రం సక్రమంగా లేదు అని నేను స్పష్టంగా మనవి చేస్తు న్నాను. ఈ బెదరింపులతో ప్రజా ఉద్యమాలను అణచివేయదలచుకొన్నట్లయితే లేక ఇటువంటి వైఖరులు అవలంబించుటవల్ల ప్రజా సమస్యలుగాని దేశము యొక్క సమస్యలుగాని పరిష్కారము చేయాలనుకొన్నట్లయితే, అది కేవలం భ్రమ యని మాత్రము మనవి చేయక తప్పదు. చరిత్రనుంచి వారు పాఠము

గ్రకొనవలెనని వారికి మనవి చేస్తున్నాను. లేకుంటే, చరిత్రే వారికి పాఠము చెపుతుందని హెచ్చరికచేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

*شری میر احمد علی خان (ملک پیٹ) [Shri Mir Ahmad Ali Khan (Malakpet)]

- جناب صدر - جناب والا کی اجازت سے ذریعہ تعلیم کے متعلق میں بھی اپنے خیالات کا اظہار کرنا چاہتا ہوں۔ ذریعہ تعلیم کے متعلق ہمارا مطمح نظر یہ ہونا چاہئیے کہ جتنا جلد ممکن ہوسکے ہماری تینوں جامعات میں ذریعہ تعلیم عوام کی زبان یعنی تلگو قرار دی جانی چاہئیے - اس میں شبہہ نہیں کہ یہاں اردو زبان بولنے والوں کی اقلیت بھی ہے جو تقریباً (۱۰) فیصد ہیں - لیکن انگریزی زبان کو ذریعہ تعلیم بنانا کسی حال میں بھی مناسب نہیں ہے - اس وجہہ سے کہ ایک طالب علم جس زبان میں اپنی ابتدائی اور وسطانی تعلیم حاصل کرتا ہے اوس زبان میں جامعاتی تعلیم حاصل کرنے کا موقع دینا چاہئیے - اس میں نہ صرف طالب علم کو سہولت ہوگی بلکہ اس کے ذریعہ سے زبان کو بھی ترقی دیجاسکتی ہے - جناب والا جانتے ہیں کہ یہاں انگریزی زبان بہت ہی قلیل آبادی کی زبان ہو تو ہو - اور اسطرح کی دوسری زبان بولنے والوں کی بھی اقلیت ہوسکتی ہے لیکن (۹۰) فیصد آبادی تلگو بولنے والوں کی ہے اور (۱۰) فیصد اردو بولنے والوں کی ہے - اس لئے تلگو کے ساتھہ ساتھہ ہم کو اردو بولنے والوں کے لئے بھی کچھہ تحفظات اور سہولتیں مہیا کرنا چاہئیے - مثلاً یہ کہ حیدرآباد شہر کی جامعہ عثمانیہ میں اردو میڈیم کا بھی کچھہ انتظام رکھتے ہوئے بقیہ آبادی کے لئے زیادہ تر ہم کو تلگو میڈیم میں اعلی سے اعلی تعلیم کا انتظام کرنا چاہئیے - ہم دیکھتے ہیں کہ دنیا کے تمام ترقی یافتہ ممالک میں اعلی سے اعلی تعلیم بچوں کی مادری زبان میں دیجاتی ہے - پھر کوئی وجہہ نہیں ہے کہ ہمارے آندھر پردیش میں بھی بچوں کو اون کی مادری زبان میں اعلی تعلیم نہ دیجائے۔ نہ صرف دنیا کے انتہائی ترقی یافتہ ممالک مثلاً امریکہ - انگلینڈ - فرانس اور جرمنی وغیرہ میں جہاں سائینس - آرٹس اور فلسفہ وغیرہ اپنے انتہائی عروج پر ہے اپنی اپنی زبان میں تعلیم دیجاتی ہے بلکہ ایشیاء کے دوسرے ممالک جو اوتنے ترقی یافتہ نہیں ہیں ترجموں اور ماہرین کی تصانیف کے ذریعہ اپنے ادب اور علم کو مالا مال کرکے اپنی اپنی زبان میں تعلیم دے رہے ہیں - مثلاً ترکی میں انگریزی یا فرانسیسی زبان ذریعہ تعلیم نہیں ہے - مصر میں بھی انگریزی ذریعہ تعلیم نہیں ہے - نہ ہی چین اور جاپان میں ہے - ایشیا کے تمام ممالک میں مادری زبان کو ذریعہ تعلیم قرار دیکر اعلی سے اعلی تعلیم دیجارہی ہے - پھر کوئی وجہہ نہیں کہ ہندوستان میں بھی یہاں کی زبانوں میں اعلی سے اعلی تعلیم نہ دیجاسکے - اسکی وجہہ سے نظم و نسق میں سہولت ہوگی - اور تعلیم حاصل کرنے میں وہ یقیناً ہمارے لئے بہت ہی مفید ہوگی - لیکن اس کا مطلب یہ نہیں کہ انگریزی یا ہندی کو ہم وہ اہمیت نہ دیں جسکی وہ مقتضی ہیں - جو لوگ زیادہ صلاحیتیں رکھتے

ہیں اور علم و فن کے اعلی مدارج طے کرنا چاہتے ہیں اون کے لئے انگریزی زبان کا اعلی سے اعلی معیار برقرار رکھا جا سکتا ہے۔ اور فی الحال لازمی طور پر انگریزی کو بھی رکھا جا سکتا ہے۔ ہندی ہندوستان کی سرکاری زبان ہے۔ ایک اسٹیٹ اور دوسرے اسٹیٹ کے درمیان مراسلت کے لئے اسکو استعمال کیا جاتا ہے۔ اسکو بھی رکھنا چاہئیے۔ لیکن عام طور پر زریعہ تعلیم اوس زبان کو قرار دینا چاہئیے جو یہان کے زیادہ سے زیادہ لوگون کی زبان ہے۔ اس لئے آندھرا یونیورسٹی میں تروپتی یونیورسٹی میں اور عثمانیہ یونیورسٹی میں ذریعہ تعلیم تلگو ہونا چاہئیے اور اس کے ساتھہ ساتھہ اردو جن لوگون کی مادری زبان ہے اون کے لئے بھی انتظام کرنا چاہئیے تا کہ وہ بھی اپنی مادری زبان میں تعلیم حاصل کرسکین۔ اس کی گنجائش رکھتے ہوئے بقیہ لوگون کے لئے آندھر پردیش کی زبان میں تعلیم ہونا چاہئیے۔ یہاں عثمانیہ یونیورسٹی کو تلگو یونیورسٹی میں تبدیل کرنے کی سہولت ہے۔ کیونکہ سابق میں اردو کے سلسلہ میں اس کا تجربہ کیا گیا ہے اور جو کامیاب تجربہ رہا۔ اس وقت اردو کا انتظام کرنے کے لئے کوئی خاص کوشش کی ضرورت نہین ہے۔ کیونکہ اس کا بہت کچھہ مواد موجود ہے۔ اس کے علاوہ ایک اور چیز میں عرض کرنا چاہتا ہوں وہ یہ کہ اس یونیورسٹی کا انتظام اسٹیٹ گورنمنٹ اور عوام کے ہاتھوں میں ہی رہنا چاہئیے نہ کہ دوسروں کے ہاتھہ میں۔ کچھہ عرصہ پیشتر سنٹر نے اس سلسلہ میں ایک موو کیا تھا اور جامعہ عثمانیہ کو مرکزی حکومت نے حاصل کرکے وہان ہندی کو ذریعہ تعلیم قرار دینے کی کوشش کی تھی اوس وقت حیدرآباد کے عوام کی ایک بڑی اکثریت نے شدید مخالفت کی تھی۔ اس لئے اس کا انتظام ہم کو اپنے ہاتھہ میں رکھنا چاہئیے اور اسکو تلگو یونیورسٹی میں تبدیل کرنا چاہئیے۔ اس کے علاوہ اس میں اردو مادری زبان رکھنے والوں کے لئے بھی کچھہ انتظام کرنا چاہئیے اون کے لئے بھی علحدہ کلاسس قائم کرنا چاہئیے۔

میں اسی ایک پائنٹ پر جناب والا کی اجازت سے عرض کرنا چاہتا تھا۔
شکریہ۔

*శ్రీ యస్. పి. చెంగల్రాయనాయుడు (నెపంజేరి): అధ్యక్షా, మంత్రిగారు ప్రవేశపెట్టినబిల్లును సమర్థిస్తూ కొన్నిసూచనలుచేయదలచుకొన్నాను. ముఖ్యంగా మనబడ్జెటులో N. G. Os. కుగాని, టీచర్సుకుగాని, విలేజి ఆఫీసర్సుకుగాని, ఏమీ allot చేయలేదు. ఇది లోటు బడ్జెటు కాబట్టి, మనకున్న యిబ్బందులలో వారికేమీ యివ్వలేకుండా పోయినాము. ఆవిషయం మంత్రిగారు పదేపదే చెపుతూ వచ్చారు. అయినా వారి కోర్కెలను తీవ్రంగా నిరాకరించకుండా మనం వారి కష్టాలను సింపథైజ్ చేస్తూ యీ సంవత్సరం కాకపోయినా వచ్చేసంవత్సర

మైనా, ఏదైనా సహాయం చేస్తామని హామీ యిస్తే బాగుండేది. మనం తీవ్రంగా నిరాకరించుతున్నందువల్ల వారికి కష్టము వేస్తూవున్నది. ముఖ్యంగా N. G. Os. విలేజి ఆఫీసర్లు, టీచర్లు కష్టపడుతూ చాలా యిబ్బందులలో వున్నారు. ధరలు అధికమైనవి. వారికి కొంత సానుభూతి చూపించవలసిన అవసరం వున్నది. ఇప్పుడు డబ్బులేకపోయినా, యీ సంవత్సరం కాకపోయినా వచ్చే సంవత్సరమయినా యివ్వవలసి యుంటుంది. అయితే వారు కొన్ని అరాచక శక్తుల వలలో తగులుకొంటున్నారు. అందువల్ల, వారిని ప్రభుత్వం తీవ్రంగా హెచ్చరించిందని అనుకొంటున్నాను. ముఖ్యంగా N. G. Os. గాని, విలేజి అఫీసర్లు గాని, టీచర్లుగాని, యీ అరాచక శక్తులతో ఏమాత్రం సంబంధం పెట్టుకోకుండవలసిన వారు. అటువంటివారి వలలో తగులుకోకుండా వుండేందుకు గాను, తండ్రి తన బిడ్డను చెడు సహవాసములో పగులుకొనకుండా ఎట్లా హెచ్చరించునో, అట్లా వారిని ప్రభుత్వాం హెచ్చరించినపని అనుకొంటున్నాను.

శ్రీ గోపాలరెడ్డిగారు బడ్జెటు ఉపన్యాసంలో, బడ్జెటులో లోటు వచ్చిందని, అది భర్తీ చేయుటకు సభ్యులే ఏమి చర్యలు తీసుకొనవలెనో, కొత్త పన్నులు ఏమి వేయవలెనో చెప్పమని కోరారు. పన్నులు వేయుట వారికి 'హాబీ' అని ముందే చెప్పారు. వారిని ఆర్థికమంత్రిగారు అని అనుటకంటే, పన్నుల మంత్రిగారు అని అంటే బాగుండేదేమో, ఆర్థికమంత్రిగారు అంటే ఆర్థిక పరిస్థితులు చక్కపరచి, అధిక వ్యయము తక్కువచేసి, డబ్బు సర్దుబాటు చేసేటటు వంటివారు ఆర్థికమంత్రి అవుతారు. లోటు బడ్జెటు అయినప్పుడు, ఎక్కడైనా ఎక్కువ ఖర్చు అవుతూంటే దానిని అరికట్టుటకుపోయి, పన్నులువేసి భర్తీ చేస్తానంటే, వారు పన్నుల మంత్రి అవుతారు. కాని ఆర్థికమంత్రి ఎంతమాత్రము కారు, వారు సభ్యులనే ఏవైనాసూచనలు యివ్వమన్నారు. ఏదో యిబ్బందులను తప్పించుకొనుటకు సభ్యులను అడుగుతారు, కాని సభ్యుల సూచనలను తీసుకొనరు. అవి మామూలే, ముఖ్యంగా P. W. D. డిపార్టుమెంటులో, హైవేస్, ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులో, ప్లానింగు డిపార్టుమెంటులో ఎంత అన్యాయంగా ఖర్చు అవుతున్నదో, ఎంత ధారబోస్తున్నామో మనము ఒకసారి ఆలోచిస్తే, ఆ ఖర్చులను తగ్గించుటకు నిజంగా హృదయ పూర్వకంగా ఆర్థిక మంత్రిగారు ప్రయత్నిస్తే యిది deficit budget అని చెప్పేందుకు వీలులేకుండా surplus budget చేయవచ్చును. P. W. D. లో తగ్గిస్తే వారేమనుకుంటారో మిగతా డిపార్టుమెంట్సులో తగ్గిస్తే ఆ మంత్రులు ఏమనుకుంటారో అని భయపడి ఏ డిపార్టుమెంటు జోలికి పోకుండా, రైతులు— దున్నపోతుల మాదిరిగా కష్టపడేవారు—

**డాక్టరు బి. గోపాలరెడ్డి :** రైతులను దున్నపోతులతో పోల్చుట 'పార్లమెంటరీ (సాంప్రదాయం) అవుతుందా ?

శ్రీ ఎన్. పి. చెంగల్రాయనాయుడు : ఇంతకుముందు లేదు, ఇప్పుడు ఉన్నదని చెపుతున్నారు, సంతోషం. ఇకనైనా, యివి purchase committee ద్వారా కొంటే దుబారాలు లేకుండా పోతాయి. మనం ఆర్థికంగా బాగు పడాలంటే, మద్రాసులో ఉన్నప్పుడుగాని, హైదరాబాదులో ఉన్నప్పుడుగాని industrialగా మనం develop కాలేదు. Industrialగాdovelop కాకపోతే అధికంగా sales Tax రాదు. మధ్య తరగతి ప్రజలు బాగుపడేందుకు వీలులేకుండా పోతున్నది. అందువలన industries పైన శ్రద్ధవుంచి అధికం చేస్తే, ప్రభుత్వమే కాకుండా ప్రజలుకూడా బాగుపడేందుకు వీలుంటుంది. ఆర్థిక మంత్రిగారు దీనిని ప్రభుత్వ దృష్టికి తెచ్చి, చూడవలసి యుంటుంది.

ఈ దినం రెవిన్యూ మంత్రిగారు ఒక ప్రశ్నకు సమాధానం చెపుతూ ఒక విషయం చెప్పారు. కరువు కాటకాలు వచ్చినప్పుడు, పన్నులు, తక్కావీ బాకీలు, ప్రభుత్వమునకు కట్టవలసిన వన్నీ వాయిదా వేస్తూ వచ్చారు. ముఖ్యంగా రాయలసీమలో సుమారు 6,7 సంవత్సరములవరకు వర్షములేకుండా కరువుతో రైతులు బాధలు పడ్డారు. అప్పుడు ప్రతిసంవత్సరం వాయిదా వేస్తూ 6 సంవత్సరములవరకు పన్నులు వాయిదావేశారు. ఈ 6 సంవత్సరముల పన్నులు ఇప్పుడు ఒక సంవత్సరములో కట్టాలంటే కష్టము. కర్నూలులో వున్నప్పుడు గోపాలరెడ్డిగారు ఒక ఉత్తర్వు వేశారు. ఈ పన్నులు ఒకతూరి కట్టడం కష్టమని instalments గా తీసుకొంటే బాగుంటుందని అన్నారు, 6 సంవత్సరములలో బకాయీపడింది, ఒక్కసంవత్సరంలో వచ్చే వరుంబడిలో కట్టలేరు. కాని ఈ దినం రెవిన్యూ మంత్రిగారు చెప్పినదేమంటే ఏదోవిధంగా కట్టివేయాలని. ఏదోవిధంగా భూమి అమ్మిఅయినా కట్టివేయాలని వారి ధోరణి. రైతులు భూమిఅమ్మి కట్టాలంటే, భూములు అమ్ముకుంటే ఈ ప్రభుత్వం కొనుక్కుంటుందా ? కొనుక్కుంటే యీయన రెవిన్యూమంత్రిగా ఎందుకు వుండాలని నాకు ఆలోచన వచ్చింది. ముఖ్యంగా రైతులు బాగుపడాలని, వృద్ధిలోకి రావాలని రెవిన్యూమంత్రిగారికి వుండాలిగాని, రైతులు భూములు అమ్ముకోవాలని, అలాంటి యోచనలు వుండకూడదు.

Planning విషయంలో ఒకసంగతి మనవి చేస్తున్నాను. (అధ్యక్షా, యింతకుముందు నాకు అవకాశం రాలేదు. ఈ దినం 5 నిమిషాలు ఎక్కువ యిప్పించాలని మనవి చేస్తున్నాను.) ఈ ప్లానింగ్ డిపార్టుమెంటు M. L. A. లకు ఒక సర్క్యులర్ పంపించింది. వారు దానిని అసెంబ్లీసభ్యులకు పంపుటకు (పోస్టేజి) స్టాంపులుకూడ లేవేమో, మేమే డబ్బులుయిచ్చి తీసుకోవలసి వచ్చింది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : ఇకముందు అటువంటివి వస్తే రిటరన్ చేయ వచ్చు.

శ్రీ ఎన్. పి. చంగల్రాయనాయుడు : రిటరన్ చేస్తే అందులో ఏమున్నదో తెలుసుకొనుటకు కష్టము. కాబట్టి డబ్బు యిచ్చి కొనుక్కొంటున్నాము. మంత్రిగారు నాకు ఒక్కరికేకాక అందరికీ యిట్లా ఏర్పాటుచేస్తే, యింకా కొంతడబ్బు సేకరించవచ్చును.

ఈ N. E. S. Block ను జిల్లాలలో select చేసేటప్పుడు కొన్ని సూచ నలు యిచ్చారు. (పోస్టల్ స్టాంపు లేకుండా వచ్చిన కవరులోని విషయాలు చెపుతున్నాను. N. E. S. programme-selection of areas for N. E. S. Blocks దీనికి కొన్నిసూచనలిచ్చారు. ఈ సూచనలు ప్రకారం వున్నచోట్ల బ్లాకును సెలక్టు చేస్తామన్నారు. అయితే ఒకటి జరుగుతున్నది. చిత్తూరు జిల్లా లోని వేపంచేరి నియోజకవర్గంనుంచి నేను వచ్చాను. అది చాలా వెనుక బడిన ప్రాంతము. ఇప్పటికి చిత్తూరుజిల్లాలో ముగ్గురు కలెక్టర్లు మారారు. ఈ ముగ్గురు కలెక్టర్లు కూడ, చిత్తూరుజిల్లాలో ఎక్కడైనా యీ నేషనలు ఎక్స్టెషన్ సర్వీస్ బ్లాకులు పెట్టాల్సిఉంటే, యీ వేపంచేరిలోనే పెట్టాలిగాని, ఎక్కడా పెట్టవీలులేదని వ్రాశారు. కాని, నేను మూడుసంవత్సరాలుగా చూస్తున్నాను. అప్పుడు ఎవరు ముఖ్యమంత్రిగా ఉన్నారో, వారివారి గ్రామా లకు ఇవ్వటము జరుగుతున్నది. అప్పుడు గోపాలరెడ్డిగారు తంబళ్లపల్లెకు పులి చెర్లకు ఇచ్చినారు, ఇప్పుడు సంజీవరెడ్డిగారు రామకుప్పం, కార్వేటినగరంకు ఇచ్చినారు. నేను ఒక్కటే అడుగుతున్నాను. ఏ సూత్రాన్నిబట్టి ఇక్కడ సెలక్ట్ చేసినారు ? కంట్రిబ్యూషన్ ఉందా ? ఏమి ఉంది ? ఏమీ లేకుండినా, మంత్రి గారికి కావలసినవారు కాబట్టి అక్కడ యన్. ఇ. యస్. బ్లాక్కు ఇవ్వవలసినది: ఇదే వారిసూత్రం అయితేమాత్రం అది చాలా పొరబాటు. ఎవరైనాసరే. వెనుకబడిన ప్రాంతాలకు మాత్రమే ఇటువంటి బ్లాకులు ఇవ్వాలని కోరు, తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : మా తాలూకాలో ఇంతవరకు రాలేదు. ఎప్పుడు వస్తుందోకూడ తెలియదు. వచ్చే ఐదేళ్ళలోకూడ వస్తుందో రాదో.

శ్రీ యన్. పి. చంగల్రాయనాయుడు : నేను ఆర్థికమంత్రిగా ఉంటే నా ఏరియాలో బ్లాకే పనిలేదు. ఎంత డబ్బు కావాలన్నా వేరే రూపంగా ఇవ్వవచ్చు. నేను ఒకటిమాత్రం, ఎడ్మినిస్ట్రేషన్ విషయం చెప్పవలసిఉంటుంది. మంత్రులు అయినతర్వాత కొందరు విపరీతంగా ప్రవర్తిస్తున్నారు, (మా వ్యవసాయశాఖా మంత్రిగారు, నా స్వవిషయం, బంధువుల విషయంలో నాకు

సంబంధం ఉన్నదనుకోండి) అక్కడ ఒక పట్టాభూమిలో కట్టెలు కొట్టుకొనేందుకు సెల్లింగ్ పర్మిషన్ కలక్టర్ ఇవ్వవలసిఉన్నది. ఆ సెల్లింగ్ పర్మిషన్ ఇచ్చేందుకు ఆలస్యం అయితే, కలక్టర్ న్యాయంగా ఇవ్వకుండా పోయినపుడు ఇప్పుడు వ్యవసాయశాఖామంత్రిగా ఉండిన తిమ్మారెడ్డిగారే అప్పుడు కలక్టర్ దగ్గరకు వెళ్ళి, మా బదులు రిప్రజెంట్ చేసి "ఇది అన్యాయం, వారికి భూమిలో న్యాయంగా సెల్లింగ్ పర్మిషన్ ఎ. పి. యఫ్. యాక్టు ప్రకారం ఇవ్వాలి. మీరు ఇవ్వకుండా ఉంటే న్యాయంకాదు. మీరు ఇవ్వకుండాఉంటే, లేదని కారణం చెప్పండి. వారు కోర్టుకు పోవచ్చును" అని చెబితే, అప్పుడు కలక్టర్ పర్మిషన్ ఇచ్చినారు. మరల నాయకుని ఎన్నిక, అవన్ని వచ్చినాయి. ఎన్నికలతర్వాత మాపైన వారికి కోపంవచ్చింది. కోపంవచ్చి......

డాక్టర్ బి. గోపాలరెడ్డి : ఇవన్నీ ఎగ్రికల్చర్ డిమాండ్ మీద చెపితే బాగుటుంది. ఇది ఎప్రాప్రియేషన్ బిల్లుమీద చర్చ. వీరుచేప్పేది ఎప్రాప్రియేట్ గా ఉన్నదో లేదో తెలియదు.

శ్రీ యన్. పి. చంగల్రాయ నాయుడు : అధ్యక్షా, నేను ఎగ్రికల్చర్ పైన చెప్పటంలేదు. నేను ఎడ్మినిస్ట్రేషన్ పైన కొన్ని విషయాలుమాత్రం చెబుతున్నాను. అక్కడ ఇవన్నీ నిలిపివేసి అన్యాయం చేసేదానికి ప్రయత్నిస్తున్నారు......

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) : మంత్రిగారికి కోపం వచ్చిందని అన్నారు. ఎందువల్ల కోపంవచ్చిందో చెబితే బాగుంటుంది.

శ్రీ యన్. పి. చంగల్రాయ నాయుడు : అవన్నీ మీకు తెలుపవలసిన అవసరంలేదు. వారికి అర్థంఅవుతాయి. ముఖ్యంగా దానిని కారణములేకుండా నిలిపినారు. నిలిపినపుడు ఏమికారణం కడపట చెప్పినారంటే, వీరికి ఉండే పరియాకంటె అధికంగా కొట్టుకొన్నట్లు నామనస్సుకు తెలుస్తోంది. కాబట్టి నిలిపివేశామని డిస్ట్రిక్ట్ ఫారెస్ట్ ఆఫీసర్ గారు అన్నారు. అధికంగాఉంటే దానికి డబ్బు పెట్టించుకొంటామన్నాము. దానికికూడ వారుఇవ్వలేదు. అక్కడనుంచి మంత్రిగారువచ్చి, కలెక్టర్ కు ఆర్డర్ ఇచ్చేదానినికూడ నిలిపి, ఇక్కడ ప్రభుత్వాని కొచ్చేటట్లు చేసినారు. అది ప్రభుత్వానికి వచ్చినతర్వాత రెవిన్యూమంత్రిగారు "ఈ బొగ్గులన్నీ ౨ విడిచేయవలసింది, డిపాజిట్ తీసుకొని విడిచేయవలసింది, రెవిన్యూబోర్డు మెంబరు విచారించిన తరువాత ఏ తీర్మానం ఉంటే, ఆ తీర్మానంచేస్తాము" అన్నారు. జనవరి ఒకటవ తేదిన రెవిన్యూ మంత్రిగారు ఆర్డర్ వేస్తే, మార్చి ఆఖరువరకు ఆఫైలు సర్క్యులేషన్ లో తెప్పించుకొని యీ ఫారెస్టు మంత్రి అక్కడనుంచి ఆ కాగితాలు కదలనివ్వ లేదు. మరల హైకోర్టుకు పోవలసివచ్చింది. హైకోర్టుకుపోయి ఆర్డర్లు తీసుకో

వలసివచ్చింది. ఈ నష్టమంతా ప్రభుత్వం కట్టితీరయవలసివస్తుంది. ఈ నష్టము కట్టేయవలసివచ్చినపుడు ఇదిమంత్రిగారు కట్టేస్తారా ? లేకుంటే యీ నష్టమంతా ప్రభుత్వంమీద పడుతుందా అని అడుగుతున్నాను. ఇది ఎట్లా ఉన్నదంటే, ముందు కోతి కల్లు త్రాగితే దానికి తేలుకూడా కుడితే ఎట్లా ఉంటుందో, ఆవిధంగా ఉంది. ఈ అధికారం దుర్వినియోగం చేసేది. ఇటువంటివి జరక్కుండా చూడాలని ప్రభుత్వాన్ని కోరుతూ విరమిస్తున్నాను.

*Sri M. Rajeswara Rao* (*Divi - Reserved*): Mr. Speaker Sir, I rise to speak in support of this Bill and in so doing, I would like to make certain suggestions for a smooth carrying on of our administration. It has been my painful duty ever since I became a M.L.A. to complain often that the present-day administration revolving as it were on red-tapism has been snatching away about 50 percent of our revenues like a white ant and has also presented a most difficult paradox viz., while expenditure on services is abnormally high with a corresponding decrease in efficiency, quality and quantum of work turned out, the agitation among the services for their too meagre salaries has been gathering momentum day by day. Under these circumstances, I am not without reason to believe or foresee a contingency when the whole administration together with our development plans may come to a stand-still if the present administrative machinery in its present form is to continue to function. It has therefore been my earnest endeavour to impress upon the Government for an immediate reorganisation of the entire administrative set up. And for this purpose, I think the Government is aware, I have presented a formula based on 5 principles. These principles are: firstly, a change in the procedure so as to eliminate too much duplication in the disposal of files: secondly, redistribution and a redefinition of the functions of Gazetted Officers whereby they undertake to be more realistic and original in their outlook; thirdly, reduction by 50 per cent of the staff, starting with the abolition of certain superfluous institutions like the Board of Revenue etc. fourthly, an increase by 25% of the existing emoluments to the .emaining non-gazetted Government servants; and fifthly, co-ordination between officials and non-officials at important levels of administration. This formula I believe would resit economy in expenditure, and at the same time it attempts at an increase in the salaries of the low-paid Government servants and also helps for a smooth working of the administrative machinery. I therefore request the Government to immediately appoint a High Power Committee to go into the entire question and report to the Government at an early date, as any delay in the matter is likely to have very adverse effects on the administration vis-a-vis the services.

Another aspect of our public administration which needs mention is the question of land revenue. I think, hon. Members are aware that the total land revenue we collect to-day amounts to Rs. 1024 lakhs, while we spend Rs. 450 lakhs for its collection. Roughly speaking, it works out to 44 per cent of the revenue. There is a heavy and elaborate machinery for the collection of this land revenue. Once the land revenue accounted for a substantial portion of the Governmental revenue, whereas now our revenue constitutes less than 20 per cent of the total revenue. But the same staff and the same machinery continues. Further, it has complicated matters in duplicating the work and therefore, I would like to make a bold suggestion for the careful consideration of the Government i. e., whether it is not possible to give up this land revenue in favour of the Panchayat Boards and instead take a 75 per cent share from the Panchayat Boards. I think the Government would do well to examine this question carefully. By this, I anticipate a net saving of 194 lakhs of rupees and even if we make an allowance for an expenditure of 94 lakhs of rupees for the maintenance of land records and Government lands, still I expect one crore of rupees by way of saving.

Another important aspect of our administration which needs mention is the Board of Revenue. Time and again, I have been one of the protagonists for the abolition of this Board of Revenue for a variety of reasons, which I need not mention here. However, I will confine myself to saying that if the Government feels that a co-ordinating machinery between the District administration and the State is absolutely necessary, then why cannot we appoint a Regional Commissioner, one for 4 or 5 districts to be in charge of land revenue of all kinds and also to be in charge of Planning. Therefore I request the Government to carefully examine this aspect of abolishing the Board of Revenue and appoint a Regional Commissioner, one for each region with headquarters in that region, so that the headquarters will be easily accessible to the people in that region.

Again, it would be appropriate, in this connection, to impress upon the Government the immediate need for bringing about legislation to regularise the service conditions of Government servants as contemplated under Article 309 of our Constitution. Now, as it is, we are indefinitely continuing the executive orders without bringing in the necessary legislation. It would be well if the Government comes before the House with a definite legislation so as to guarantee the security of services. Again, mention may also be made about the figures furnished in the Budget. This Budget does not disclose the number of Government servants actually working in each cadre and under each head and separate figures are not given under each of the categories. I have gone through the entire budget proposals and the Appen-

dices which are appended to the main Budget. I did not find these figures. It clearly shows that the Government itself is not in a position to know how many Government Servants are working under each head or category. I, therefore, humbly appeal to the hon. Finance Minister to direct his Department to furnish to the House a correct picture of our administrative machinery, so as to enable the hon. Members to know what kind of machinery is actually at work.

Then, I take this opportunity to draw the attention of the Government to the basic principle of our parliamentary practice viz., that for a proper functioning of parliamentary democracy, we have, invariably, to follow the principle of separation of power - particularly under a democratic Constitution. Therefore, under democartic Constitution and for the proper functioning of the parliamentary democracy, the Ministry has to confine itself to policy-making. But, unfortunately the Ministry has deviated from this principle to the detriment of the growth of parliamentary democracy itself. I, therefore, appeal to the Government to consider this, and I express my hope that the Ministry would, hereafter, try to establish healthy conventions in this regard.

Another aspect of our administration is Legislation. There is a growing feeling everywhere in the State that we are passing legislation hurriedly and without properly understanding the implications of the various Acts, as a result of which, the several provisions of our Acts are being held null and void by Courts of Law either on grounds of want of jurisdiction or of being repugnant to the provisions of the Constitution. I, therefore, request the Government and make an earnest appeal that the Government should constitute an expert committee of legal experts - a standing committee of legal experts - and to place all the Bills before such a committee, before they are introduced in the House, so that they can be subjected to strict scrutiny. Therefore, all old Acts are to be revised and new Bills to be introduced, should be subjected to a scrutiny by the standing committee of legal experts.

Mr. Speaker, Sir, in this connection, I would appeal to the Government to discourage judicial functions being entrusted to the executive. This is also another aspect of the fundamental principle of separation of power followed in parliamentary democracy. Hon. Members are aware how our Tahsildars, under the present Tenancy Act, have been discharging their judicial functions. The directive principles enunciated in our Constitution also warrant that separation of Judiciary from the Executive should be introduced throughout the State. I request the Government to introduce the separation of Judiciary in the remaining three districts also. Therefore, it is high time

that the Government should take measures to take away the Judiciarly functions from the Executive Officers and to entrust the same to the independent Judiciary.

Today, our State Governments are charged with the task of Planning and Development, and the important objects of our Second Five Year Plan are to increase production and ensure proper distribution of the same. But, today, we are facing a paradox. While we feel that there is sufficient production so far as our Andhra State is concerned, the prices appear to be very high and we have to find out a solution for that. As far as I am concerned, I feel I am justified in making a suggestion to the Government to revive the Producer-cum-Consumer Co-operative Societies as enunciated by our departed Leader, Sri Prakasham Panthulugaru, which is the only solution for this problem. I feel that this is a proper solution both to the producer and also to the consumer.

Another important aspect is about the industries and to show employment opportunities to various unemployed people. Now, from a perusal of the Paper laid on the Table of the House, it is found that our industries are running a recurring loss. If this is the kind of our administration on industrial side, I think it does not warrant the Government nationalising industries any further. I would, therefore, appeal to the Government to examine the possibility of constituting an Industrial Corporation, inviting capital from private sector and see whether these industries can be properly run under the supervision of the Government.

I wish to say one word regarding Social Welfare. We have submitted a report and it is with the Government. In this connection, I only say that the policy now pursued by the Government in regard to this problem has a tendency for further segregation. I feel that there should be a reorientation of the entire policy and a Statutory Board should be constituted as recommended by this Committee.

Finally, with regard to the Appropriation Bill, I would say only one thing. I know we have got an expert Finance Minister and I do not think he would come before this House once again during the course of the year for Supplementary Grants. On the other hand, I do hope that he would inform the House of the probable savings out of the amounts which we have already granted in this Session.

Thank you, Sir.

*శ్రీ బి. రామారెడ్డి (మైదుకూరు) : అధ్యక్షమహాశయా, దాదాపు నాలుగు రోజులు సాధారణ చర్చ, 14 రోజులు డిమాండ్సుపైన చర్చలు జరిగినాయి. అన్ని డిమాండులు మెజారిటీతో ఆమోదించబడినవి. వాటిని యిప్పుడు ఏదో ఒక విధంగా సమీక్షచేసుకోవలసి వచ్చింది. కాని ఈ సమీక్షలో

మిత్రులు చాలామంది ముఖ్యంగా చర్చను ప్రారంభిస్తూ గౌరవనీయులైన శ్రీ రావి నారాయణ రెడ్డిగారు కొన్ని విషయాలు చెప్పారు. సభ్యులందరూ కూడా చాలా నిర్మాణాత్మకమైన సూచనలు యిచ్చినారు. ఇవ్వమని కూడా అడిగినారు. "అడిగిన ఫలితంగా మేమిచ్చిన నిర్మాణాత్మకమైన సూచనలకు మంత్రివర్గం యిచ్చిన సమాధానాలు చాలా నిరాశాజనకంగా వున్నాయి" అన్నారు. ఆ సందర్భంలో ఒక విషయం వారి దృష్టికి తేదలచాను. ఆర్థిక మంత్రిగారు తమ బడ్జెటు ఉపన్యాసంలో ముఖాముఖిగా, తేటతెల్లంగా, అరటి పండొలచి చేతిలో పెట్టినట్టు బాగా వ్రాసే వున్నారు. అది చదువుకుని కూడా మళ్ళీ వారిని విమర్శించడం బాగుండదేమోనని వారికి చదివి వినిపిస్తున్నాను. "సమన్వయం అనేది అవసరం. మన ఆలోచనలు ఆకాశపథాన్ని సంచరిస్తాయి. మన మాటలు కోటలు దాటుతాయి. మన చేతలు మాత్రం పాతవే" అన్నారాయన. ఈ విధంగావారు విస్పష్టంగా "మీరు ఏదో చెప్పండి. మీరు చెప్పక తప్పదు, మేము వినక తప్పదు. అంతేకాని మా పనులుమాత్రం పాతవే"నని వారు చెప్పివున్నారు. అందువల్ల దానినిగురించి అట్టే బాధపడవలసిన అవసరం లేదు. పొదుపు విషయమై చాలామంది ఏవేవో చెప్పుతున్నారు. "గవర్నరు గారికి ఎందుకింత ఖర్చు? అక్కడ యింత ఖర్చు ఎందుకు? ఇక్కడ యింత ఖర్చెందుకు?"అన్నారు. అవసరమైన ఖర్చులు పెట్టకుండా వుండడానికి మానవ జీవితంలో వీలులేదని చెబుతున్నాను. ఆ పదానికి వచ్చినప్పుడు శాసన సభ్యులకు ఈ cushionsఎందుకని ప్రశ్నిస్తున్నాను. సాధారణంగా కార్యకలాపం జరిగేదే ప్రధానమయినట్టి పనికదా? మరి ఆడంబరం ఎందుకనే దృష్టితో పరిశీలించినప్పుడు మానవజీవితంలో పెట్టే ఖర్చులన్నీ దుబారాయే. అవి కేవలం waste అయినదేననే అభిప్రాయ పడవలసివస్తున్నది. ఒక చిన్న విషయం తమాషాగా చెప్పబోతున్నాను. శ్రీ స్థానం నరసింహారావుగారు వేషంవేస్తున్నారంటే మనంవారియొక్క పాట అభినయంకదా చూడబోయేది. పాతగుడ్డ కట్టుకొనివస్తేమాత్రంఏమిఅనవచ్చు? ఎంత బాగుంటుందో చెప్పండి. కాబట్టి వేషమునకు తగిన భాష, భాషకుతగిన భూషణము, అన్నీ వున్నప్పుడే అది రాణిస్తుంది గాని, 'రాజు' అని కిరీటం లేకుండా, భూషణం లేకుండా చింపిరిపేలికలు వేసుకునివస్తే వాడు రాజని ఎవరు అనుకోరు. ఇంకొక విషయం చెబుతున్నాను. జనకమహారాజువంటి నిష్కామ కర్మయోగి యెవడూ లేడు. కాని ఏ పురాణంలో కూడా జనకమహారాజు ఎంత నిష్కామిగా వున్నా రాజదర్బారులో రాజభూషణాలు పెట్టుకోకుండా పోయినట్టు గాని, కాషాయాంబరాలు ధరించారని గాని ఏ పురాణాలలోనూ లేదు. కనుక ఆ విషయమై పూర్తిగా అనవసరమన్నప్పుడే ఆక్షేపణ చెప్పవచ్చునుగాని ఊరికే రోకటిపాటగా, అలవాటుల్లో పొరపాటుగా మాత్రం ప్రతిదానికి 'ఖర్చు

వద్దు, ఖర్చువద్దు' అని 'పొదుపు' అనే పదానికి అస్తవ్యస్త అర్థాలను మాత్రం తీయవద్దని నేను వారికి మనవి చేసుకుంటున్నాను.

మరొక్క విషయం. ఎన్. జి. ఓ. లు, ఉపాధ్యాయులు, గ్రామోద్యోగులు వారికి రావలసిన జీతాలను గురించి ఈ మధ్య ఆందోళన చేస్తున్నారు. గ్రామోద్యోగుల విషయంలో మిత్రులు శ్రీ నారాయణరెడ్డి గారు చెప్పిన దానితో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. ఈ విషయంలో ప్రభుత్వం చాలా తప్పు అభిప్రాయంలో ఉండి, గ్రామోద్యోగుల శక్తిని చాలా తక్కువ అంచనా వేస్తున్నారని నేను హెచ్చరిక చేస్తున్నాను. బెదిరింపులతో వారిని లొంగతీసుకోగలమనుకోవడం పొరపాటు. బ్రిటీష్ సామ్రాజ్యాన్ని సత్యాగ్రహ సమరంలో ఓడించి, తరిమి అందులోని శక్తిని చవిచూచిన కాంగ్రెసు వారు ఆలోచనలేకుండా ఈనాడు రెడ్లకు, గ్రామోద్యోగులకు, ఉన్నబలం ఏమిటి అనడం, శోచనీయమైన విషయం. గ్రామోద్యోగులు రాజీనామా ఇస్తే వారి స్థానాలలో మరొకరిని నియమిస్తామని చెబుతున్నారు. సాధారణంగా ప్రతి గ్రామోద్యోగి పెద్ద పలుకుబడిగల రైతుగానే ఉంటాడు. వానికి ఎదురుగా మరొకరువచ్చి ఆ స్థానంలో ఉంటే తెల్లవారేసరికి వాని తలకాయ ఎక్కడ ఉంటుందో అని నా అనుమానం. వారికి సమన్వయధోరణిలో సరియైన జవాబు చెప్పటం మంచిదికాని శాసనసభలో వారిని బెదిరించి అణగద్రొక్కుతామని, అది చేస్తాము, ఇది చేస్తామని చెప్పడం కొంచెం అపాయకరమైన ధోరణి అని మనవిచేస్తున్నాను. పోలీసుశాఖలో armed reserve అని ఒకటి ఉన్నది. వారి పని కవాతు చేయడం. తరువాత గోళ్లు గిల్లుకుంటూ కూర్చొనడం, ఎక్కడైనా ఏదైనా గలాభా జరిగితే, అక్కడకుపోయి ఉన్నవారిని చేతులు పనిలేక తీటపట్టి ఉంటాయి కాబట్టి, ఇష్టంవచ్చినట్లు కొట్టడం, వారిని N. C. C., A. C. C. మాదిరి అప్పుడప్పుడు సాంఘిక సంక్షేమ కార్యకలాపాలలో నియమిస్తే, వారిని సద్వినియోగంచేసుకుని పనిచేయించుకున్నట్లు అవుతుంది. వారిచేతుల తీటపోతుంది. సంఘానికి మంచి జరుగుతుందని మనవిచేస్తున్నాను. విద్య విషయంలో ఒకటి చెప్పదలచుకున్నాను. మనది తెలుగుదేశం. తెలుగుభాషను వృద్ధిచేయాలని మనమందరము ఉపన్యాస వేదికలపై చెబుతున్నాము. కాని ప్రాథమికవిద్యా విధానంలోనైనా కావలసిన సంస్కరణలు చేయాలనేభావం ఎవరికీలేదు. 'ఇంగ్లీషు,' 'ఇంగ్లీషు' అంటున్నారు. ఇంగ్లీషును కాదని నేనుఅనను. మాతృభాషఅయిన తెలుగును ప్రాథమిక పాఠశాలల్లో సరియైన పద్ధతులలో బోధించుటకు తగిన అయ్యవార్లున్నారా? భాషలో ఒకవిధమైన నేర్పరితనం రావాలంటే, పూర్వపురోజులలోమాదిరి, భాషకు నాలుకలుగా, జీవగర్రలుగా ఉన్న అమరం, ఆంధ్రనామసంగ్రహంవంటి పుస్తకాలను ప్రాథమిక విద్యా

విధానంలో ప్రవేశపెడితే విద్యార్థులకు భాషలో ఒకవిధమైన పాండిత్యంవచ్చి ముమ్ముందు ఉపయోగపడుతుంది. అంతేకాని, కాకినల్లగాఉండును; కుక్క మొరుగును; పిల్లి మ్యావు మనును—ఈ రకమైన అమ్మ, అవ్వ కథలతో అయిదు సంవత్సరాల కాలాన్ని వారికి వృథాచేయవద్దని మనవిచేస్తున్నాను. మరొకవిషయం —ఆఖరువిషయం— ముఖ్యమైనది ఉన్నది. రైతు పచ్చగా ఉంటేనేకాని వేసేపన్నులను భరించలేడు. చెంగల్రాయనాయుడుగారు రైతును దున్నపోతుతో పోల్చినారు. వెనుకటి ఒకసామెతకోసం పోల్చినారు. మేము రైతులము. ఒప్పుకున్నాము. నిజమేకూడా కొంతవరకు. ప్రభుత్వంచేసేది రైతులపై పన్నులువేయడమేనా ? వానికి కావలసిన సౌకర్యాల విషయమై ఏమైనా ఆలోచించడం ఉన్నదా ? రైతులకు కావలసిన సౌకర్యాలులేవు. కాని ధాన్యంధరలపై కొట్లాడుతున్నారు. రైతుకు ఉన్న రుణభారాన్ని తీర్చి వానిని ఏనాడు ఒకదారిలో పెడతారో ఆనాడు రైతు అధికాహారోత్పత్తి విషయంలో శ్రద్ధవహించి అధికాహారాన్ని పండిస్తాడు. ఎనడూ పడుకున్న ఎద్దును బండికట్ట లేడు. తయారుగా నిలబడితే కాడిమెడమీదపెడితే పోతుంది తాను సేద్యంచేసి పైరుపండించి ప్రజానీకానికి ఒకవిధమైన సౌకర్యంకలిగించాలని రైతుఅనుకున్న నాడే అధికాహారోత్పత్తి కార్యక్రమం విజయవంతం అవుతుంది. ఇదిజరగాలంటే రైతు పండించే ధాన్యానికి మార్కెటు చూపించాలి. వానికి కావలసిన ఎరువులు మొదలైనవి సక్రమమైన ధరలకు సకాలంలో అందించి ఇంకా ఇతర సౌకర్యాలను కలిగించాలి. ఇవన్నీ జరిగిననాడే రైతు అధికాహారోత్పత్తికి పూనుకుంటాడు. అధికాహారోత్పత్తి జరుగుతుందని మనవిచేస్తూ, ఈ అవకాశం ఇచ్చిన అధ్యక్షులవారికి ధన్యవాదాలర్పిస్తూ విరమిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : 12-15 గంటలకు శ్రీ సుందరయ్యగారిని పిలుస్తాను. 12-30 వరకు వారు మాట్లాడుతారు. 12-30 నుంచి 1-30 వరకు గౌరవనీయులైన మంత్రిగారు మాట్లాడుతారు. ఈలోపున మాట్లాడదలచుకున్నవారికి ఒక్కొక్కరికి strict గా అయిదునిముషాలు మాత్రం కాలం ఇస్తాను. ఇపుడు శ్రీ శాంతప్పగారు మాట్లాడుతారు.

*శ్రీ కె. శాంతప్ప (ధర్మవరం-రిజర్వుడు) : అధ్యక్షా, పురాణములలో చెప్పినట్లు వెయ్యి యజ్ఞములుచేసి, స్వర్గలోకమునకు అధిపతిగా దేవేంద్రుడున్నట్లు తమరు కూడా ఆంధ్రప్రదేశ్ శాసనసభ అధ్యక్షపదవిని అలంకరించినందుకు నా హృదయపూర్వకమైన వందనములు అర్పిస్తున్నాను. గౌరవనీయులైన మంత్రులకు, ప్రభుత్వపక్ష సభ్యులకు, ప్రతిపక్ష సభ్యులకు వందనములర్పిస్తున్నాను. గౌరవనీయులైన ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు ప్రవేశపెట్టిన Appropriation Bill ను బలపరుస్తూ, నా నియోజకవర్గంలో ఉండే కష్టాలను కొన్ని ప్రభుత్వ

దృష్టికి తీసుకురావడానికి ప్రయత్నిస్తాను. మాది చాలా వెనుకబడిన తాలూకా. నేను అనంతపురం జిల్లా, ధర్మవరం నియోజకవర్గమునకు చెందిన కల్యాణదుర్గం తాలూకాకు చెందినవాణ్ణి. అదిఅంతా కొండలు, రాళ్ళు ఉన్న ప్రదేశం. ఎర్రనేల భూములు. మాకు జీవనదులు లేవు. మా తాలూకాను ఆనుకొని మైసూరు రాష్ట్రంలో వేదావతి నది పారుతున్నది. ఆ నది తుంగభద్రలో కలియుచున్నది. మైసూరు రాష్ట్రంలో పరుశురాంపురం దగ్గర ఆనకట్ట కడితే మా తాలూకాలో 7, 8 చెరువులు నిండి ఆహారధాన్యాలు కొరతలేకుండా రైతులకు ఇబ్బంది లేకుండా పండించుకోడానికి అనుకూలంగా ఉంటుంది. మా తాలూకాలో విద్యుచ్ఛక్తిలేదు. చుట్టూ విద్యుచ్ఛక్తిదీపాలు వెలుగుతున్నాయి. రాయదుర్గం, గుత్తి, అనంతపురం, ధర్మవరం తాలూకాలలోను ; మైసూరు రాష్ట్రంలోని ప్రాగూరు తాలూకాలోను విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. మధ్య మాకే లేవు. 1954 వ సంవత్సరంలో గౌరవనీయులైన ముఖ్యమంత్రి సంజీవరెడ్డి గారు అప్పట్లో డిప్యూటీ ముఖ్యమంత్రిగా ఉంటూ, విద్యుచ్ఛక్తి portfolio లో ఉన్నప్పుడు ధర్మల్ స్టేషన్ ఏర్పాటుచేసి 1955 వ సంవత్సరం తెలుగు సంవత్సరాది నాటికి దీపాలు వెలిగిస్తాను అని వాగ్దానంచేశారు. ఆ వాగ్దానం నెరవేరలేదు. ప్రజలు ఎదురుచూస్తున్నారు. మాకు సరియైన రోడ్లు కూడా లేవు. ఆసుపత్రులు కూడా లేవు. ఒక చిన్న ఆసుపత్రి ఉన్నది. ఎక్కడైనా స్త్రీ, పురుషులకు కష్టాలు వస్తే 18 మైళ్ళు దూరం పోవాలి. 1952 వ సంవత్సరంలో ఉమ్మడి రాష్ట్రం రోజుల నుంచి, కర్నూలులో ఉన్నప్పుడు - ఇప్పటివరకు బడ్జెటు సమావేశాలలో ఉపన్యాసములు చెబుతున్నాను. మా గ్రామంలో ప్రస్తుత ఆర్థిక మంత్రులైన గోపాలరెడ్డిగారి ముఖ్యమంత్రిత్వ కాలంలో 18 వేల రూపాయలు ఖర్చుచేసి తోళ్ల పరిశ్రమ ఏర్పాటుచేశారు. అక్కడ పని జరగడం లేదు. మొన్నవరకు 12 మంది పిల్లలకు స్టయిపెండు ఇచ్చి చెప్పులు కుట్టడానికి ఏర్పరిచారు. దీనిని ప్రభుత్వంవారు హిందూపురమునకు transfer చేశారు. ఇది అభివృద్ధి చెందడానికి ప్రభుత్వం డబ్బు సహాయంచేసి, హరిజనులకు సహాయం చేయాలని కోరుతున్నాను.

మాకు N. E. S. బ్లాకులు లేవు. డెవలప్‌మెంటు బ్లాకులు లేవు. మా తాలూకాలో బ్లాకు లిచ్చి సహాయంచేయాలని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను. ప్రొహిబిషన్‌విషయం అనేకసార్లు చెప్పాను. "ప్రొహిబిషన్ తీసి వేయాలి. బడ్జెటు లోటు వుంద"ని ప్రతిపక్ష సభ్యులు అంటారు. కానిపనులకు మీరే పోయిన వద్దనువారు ఇంకెవరండి. దానికి ఒక శ్లోకంవుంది, చెబుతాను. "శుకం, పికం, బకం, చైవ హనుమాన్ రావణ స్థథా, వర్ణశ్చ కుంభకర్ణశ్చ సప్తైతే, లోకరక్షకాః" ఒక ముంత త్రాగితే చిలుకపలుకని, రెండవ ముంత త్రాగితే గోరువంక కేరింతలని, మూడవ ముంత త్రాగితే కొంగ జపమని, నాల్గవముంత

త్రాగితే ఆంజనేయుని కుప్పిగంతులని, అయిదవ ముంత త్రాగితే రావణబ్రహ్మ ప్రతాపమని, ఆరవ ముంత త్రాగితే దానకర్ణుడని, ఏడవ ముంత త్రాగితే కుంభకర్ణుడని - ఇవి సహజము త్రాగేవారిలో. అందుచేత బీదవారిచేత త్రాగించి, బడ్జెటు లోటు పూర్తిచేయాలని ప్రతిపక్ష సభ్యులు చెప్పటం బాగాలేదు. అది దుర్లభమైన పని అని ప్రతిపక్ష సభ్యులకు నేను మనవిచేస్తున్నాను. హారిజనులలో ఆ యా నియోజకవర్గాలలోని గౌరవసభ్యులు వారి వారి కష్టాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. నా నియోజకవర్గంలో హారిజనులకు ఎర్రనేల భూమి లేదు. ఇండ్ల స్థలాలు ఇప్పించాలని, నీటివసతి లేని గ్రామాలలో బావులు త్రవ్వించాలని, కాబినేట్ కూర్చుని ఆలోచించి, వెనుకబడిన ప్రాంతాలకు సహాయంచేయటానికి పూనుకోవాలని ప్రార్థిస్తూ ముగిస్తున్నాను.

*శ్రీ డి. కొండయ్య చౌదరి (కందుకూరు) : అధ్యక్షా ! ఈ ఎప్రొప్రియేషన్ బిల్లును సమర్థిస్తూ, ఈమధ్య రేగిన కొన్ని దుమారాలవిషయము ప్రస్తావించవలసిన అవసరం ఉంది. కనుక ప్రస్తావిస్తున్నాను. ప్రతిపక్షసభ్యులు మొదలు కొని కాంగ్రెసు పార్టీలోని కొందరివరకు, అందరు ఈ కాంగ్రెసు పార్టీలోనే భూసంస్కరణల విషయంలో భేదాభిప్రాయాలు వున్నట్లు చిత్రించటం మొదలు పెట్టారు. ఈ విషయంలో నేను ఒక సంగతి ఉద్ఘాటించదలచు కొన్నాను. కాంగ్రెసుపార్టీ సభ్యులెవ్వరూ ఈ భూసంస్కరణకు వ్యతిరేకులు కారని మనవి చేస్తున్నాను. కాంగ్రెసు అధ్యక్షులు అల్లూరి సత్యనారాయణరాజుగారు, ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఆ విషయాన్నే పదేపదే చెప్పారు. అయితే అవి తీసుకురావటములో జాప్యం జరుగుతోంది. ఇప్పుడు ప్రభుత్వం, ప్లానింగు కమిషన్‌వారుకూడా దేశంలో సోషలిస్టిక్ ప్యాట్రన్ ఆఫ్ సొసైటీ కావాలనే ఉద్దేశ్యంతోనే అన్ని పనులు చేస్తున్నారు. కాని ప్రభుత్వ పక్షంలో వుండే నాబోటివర్గంవారు ఏమి చెబుతున్నామంటే మీరు సమగ్రమైన "సామ్యవాద సమాజాన్ని నిర్మించదలచుకొంటే ఒక వర్గంమీదనే ఆర్థిక స్తోమతును కుదింప చేసి స్తంభింపచేయటానికి ప్రయత్నిస్తే అది సమగ్రమైన సామ్యవాదం కాదని." సమగ్రమైన సామ్యవాదానికి మేము సిద్ధమే. యావత్తు భారతదేశంలో అందరి ప్రజలను ఒకే రకమయిన పద్ధతిలో ఆర్థిక సమానత్వములో అనుకోండి, లేదా ఇతర అవకాశాలే అనుకోండి - అందరికి సమానంగా ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వము మీద వుంది. అంతేకాని ఒక వర్గాన్ని మాత్రమే ఆర్థిక సమానత్వానికి గురిచేసి మిగతా వర్గాలకు కావలసిన అవకాశాలను ఎక్కువ చేయటానికి పరిమితం చేయకుండా వుండటం ఆర్థిక సమానత్వం కాదని మనవిచేస్తున్నాను. అందుచేత యావత్తు అన్ని ఆస్తులమీదకూడా ఒకే రకమైన సీలింగు వుంటే అందరిని ఆర్థికంగా సమానంగా చూచినట్లు పరిపూర్ణమైన, సమగ్రమైన సామ్య

వాదానికి దారితీస్తున్నట్లు అవుతుందని నేను మనవిచేస్తున్నాను. అందువల్ల ప్రతి పక్ష సభ్యులు మేము భూసంస్కరణలకు వ్యతిరేకులమని అనుకోవటం పొరపాటు. ఆంధ్రప్రభ సంపాదకులు మొదలుకొని వీరందరు 'మేము ఫ్యూడలిస్టిక్ తత్వం కలవార'మని చిత్రించటం చాలా హాస్యాస్పదమైన విషయం. అది మిస్ లీడింగుగా వుంది. వారు కోరిన దానికన్నా మేము యింకో అడుగు ముందుకు వేస్తున్నాము. ప్రతి ఒక్కరి ఆదాయానికి ఒక పరిమితిపెట్టి, మిగిలిన సంపదను సమానంగా పంపిణి చేసినప్పుడే సమగ్రమైన సామ్యవాదం వస్తుంది. ఒక్క ఎగ్రికల్చర్ కమ్యూనిటీకి ఆదాయాన్ని పరిమితంచేసి, మిగతా కమ్యూనిటీలకు పరిమితం చేయనపుడు ఎగ్రికల్చర్ కమ్యూనిటీలలో వారికి కావలసిన పరిపూర్ణమైన వికాసమునకు అవకాశములు లేకుండా పోతాయని నేను మనవిచేస్తున్నాను. అది, 'రన్నింగు రేస్'లో ఒకనిని ఒక ఫర్లాంగో, ½ ఫర్లాంగో ముందు నిలబెట్టి మరియొకనిని అతని వెనకాలనుంచి, మీరిద్దరు సమానంగా పరిగెత్తమని చెప్పినట్లుగా వుంటుంది. కాని అది న్యాయంకాదు, ధర్మం కాదు అని మనవిచేస్తున్నాను. అది ఏ సిద్ధాంతానికైనా వ్యతిరేకము.

ఆంధ్ర పత్రిక సంపాదకుడు 'మాది ఫ్యూడలిస్టిక్ తత్వ'మ్మని చెప్పాడు. ఫ్యూడలిస్టిక్ తత్వమును వారు సక్రమంగా అర్థం చేసుకొన్నారా లేదా అని నేను వారిని అనుమానిస్తున్నాను. ఆర్థిక స్తోమతగల ఇతర విధాలయిన అవకాశాలు చేతుల్లో వుంచుకొని, తమ ఆర్థిక స్తోమతును అనుసరించి ఇతరులమీద అధికారం చెలాయించటం, ఇతర వర్గాలమీద పెత్తనం చెలాయించటం ఫ్యూడలిజం. ఇలాంటి సంపాదకులకు, ఎక్కువ జీతాలకు వచ్చేవారు, పరిశ్రమలలో ఎక్కువ ఆదాయం సంపాదించేవారు, యింకా తమ ఆర్థిక స్తోమతును పెంపొందించుకొంటూ ఆంధ్రదేశంలో ఎక్కువ జనాభా అయిన రైతుల ఆర్థిక స్తోమతను కుదింపచేసి, స్తంభింపచేసి వారిమీద, తమ బుద్ధిబలంతో, కలంపోటు బలంతో పెత్తనం చెలాయించాలనుకోవటం ఫ్యూడలిజం. కాని అందరిని సమానంగా, ఒకే స్థాయిలో వుంచటం ఫ్యూడలిస్టిక్ తత్వం కాదని మనవిచేస్తున్నాను. భూసంస్కరణల విషయంలో నేను clear గా చెప్పదలచుకొన్నాను. ఎక్కువగా చెప్పటానికి అధ్యక్షులవారు అవకాశం ఇవ్వటం లేదు. ఒక్క విషయం పత్రికలవారు వ్రాశారు. "ఇతరవిధాలయిన ఆస్తులు హెచ్చుగా సంపాదించకుండా అనేక రకాలయిన పన్నులు వేయటం లేదా?" అని కొందరు చెప్పారు. గోపాలరెడ్డిగారి దయవలన ఒక్కొక్క రైతు నేడు 1-0-0 కి 0 14-0 పెచ్చు చెల్లిస్తున్నాడు. ఇంకా రేపు ఏమి కానున్నదో మాకు తెలియదు. ఇంకా పన్నులు వేస్తామంటున్నారు. ఇప్పుడు రైతులు ఎక్కువ పన్నులు చెల్లించటం లేదా అని అడుగుతున్నాను. ఇప్పుడు ఇతర విధాలయిన ఆస్తులవల్ల వచ్చే ఆదాయాన్ని

పరిమితం చేయటానికి ఇన్‌కంటాక్స్ రూపంలోను, యింకా ఇతరమైన పన్నులు వేస్తున్నాం కదా, వారిని వదలి పెట్టింది ఏముందనేవాదం ఆంధ్ర ప్రభ సంపాదకుడు లేవదీశాడు. దానికి నేను ఒక్కటే చెబుతాను. రైతుల యొక్క ఆర్థిక స్తోమతను తగ్గించటానికి income tax వగైరాలను తగ్గించి ఆదాయాన్ని పరిమితం చేయకుండా వాళ్లు produce చేసే క్వాంటిటీ మాత్రం తగ్గింపు చేస్తున్నారు. గారడిచేసేమాటలద్వారా మేము అర్థం చేసుకోలేక పోతే దని వారికి మనవిచేస్తున్నాను. ఇక నా కన్‌స్ట్రక్టివ్ సజెషన్.

ఒక గౌ. సభ్యుడు : ఇంతవరకు చెప్పినది ?

శ్రీ డి. కొండయ్య చౌదరి : ఇదంతా ప్రతిపక్షసభ్యుల విమర్శకు నా జవాబు. నిరుపేదలు నిరుపేదలుగానే వుండి ధనవంతులు అట్లాగే పెరిగిపోతూ వుండాలనే వాదన నేను అంగీకరించను. ఇప్పుడు కోట్లకొలది ఎకరాల బంజరు భూమి వుందని గోపాల కృష్ణయ్యగారు చెప్పారు. ఆ బంజరుభూమిని బుల్ డోజర్లద్వారా, ట్రాక్టర్లద్వారా ప్రభుత్వం చదునుచేయించి, సరయిన పద్ధతిలో పెట్టి భూమిలేని వ్యవసాయ కూలీలకు ఇవ్వాలి. మన కమ్యూనిస్టు సోదరులు వారికి, వీరికి, భూమి అంటే ఏమిటో తెలియనివారికి...

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : On a point of order, Mr. Speaker, కమ్యూనిస్టుసోదరులని చెప్పారు. చెప్పదలచుకొంటే లిఖితపూర్వకంగా వారి వద్ద ఏదైనా వుంటే చదవాలి. లేనిపోనివన్నీ చెబితే మరల వాటికి సమాధానం చెప్పటానికి నాకు time లేదు.

మిస్టర్ స్పీకర్ : మంత్రుల గురించి మీరు అనేటప్పుడు కమ్యూనిస్టుల గురించి వారు అనవచ్చు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : మంత్రుల గురించి లిఖితపూర్వకంగా వున్నదే మేము అంటున్నాముకాని ఇష్టంవచ్చినట్లుగా అనటంలేదు.

మిస్టర్ స్పీకర్ : వారు వున్నవే అంటున్నారు. ఇందులో Point of order. ఏమీ లేదు..

శ్రీ డి. కొండయ్య చౌదరి : ఈ బంజరు భూములను చదును చేయించి భూమిలేని వ్యవసాయకూలీలకు ఇప్పించాలి. దాదాపు కోటి ఎకరాలు వుందని చెప్పారు. ఒక్కొక్క కుటుంబానికి 10 ఎకరాలు ఇచ్చినా 10 లక్షల కుటుంబాలు బ్రతుకుతాయి. ప్రతివారు భూమిలేని నిరుపేదలకే ఇవ్వాలని చెబుతున్నారు. కాని 10 ఎకరాలను సాగుబడి చేసుకోటానికి అయ్యే ఖర్చు ఎక్కడనుండి తెస్తారని అడుగుతున్నాను. థియరిటికల్‌గా కాక ప్రాక్టి

కల్‌గా అనుభవించేవారికి తెలుస్తుంది. ఏమీలేని నిరుపేదవానికి 10 ఎకరాల భూమి ఇస్తే కనీసం మొదట రెండు ఎద్దులు, బండి, నాగలి, ఎరువుగింజలు అయినా కొనుక్కోవలసి వస్తుంది. ఒకొక్క కుటుంబానికి రు 1,000 లు పెడితే తప్ప ఉత్పత్తి పెరగదు. అప్పుడు ఈ ప్రభుత్వం పది లక్షల కుటుంబాలకు (10 లక్షలు×1 వేయి) సొమ్ము ఇవ్వడానికి సిద్ధంగా వుందా అని అడుగుతున్నాను. భూమిలేని నిరుపేద ఎక్కడ్నుంచి డబ్బు తీసుకువచ్చి భూమిని సాగుకు తీసుకువస్తాడు ? తన ఆర్థికస్తోమతునుబట్టి, అటువంటి పేదలకు బంజరు భూమిని పంచి, వారికి ఆర్థికస్తోమతు కలుగచేసి, ఆ రకంగా ఉత్పత్తి పెంచ దలచుకొంటేయింకొక step ముందుకు వేయటం బాగుంటుంది. కాని త్వరపడి 'fools rush in where angels fear to tread' అనేసూదిరిగా పరిగెత్తుకొని పోయి, దేశానికి అపకారం, తీరని నష్టం కలిగినతరువాత తిరిగి వెనుకకు రావటం న్యాయంగా వుండదనిచెప్పి నేను మనవిచేస్తూ తమ సెలవు తీసికొంటున్నాను.

*శ్రీ కె. పున్నయ్య (చీపురుపల్లి-రిజర్వుడు) : అధ్యక్షా, ఈసారి బడ్జటు సమావేశములో అతి ప్రధానమైన విషయాలను గురించి ప్రభుత్వము యొక్క అభిప్రాయాలు ఉంటాయని ప్రజలందరు ఆశించారు. కాని అది నిరాశాపూరితముగా ఉండడమువల్ల మేము చాలా విచారపడుతున్నాము. ఎందుకంటే, ఇప్పుడు మన రాష్ట్ర పరిస్థితులు అంత క్లిష్ట సమస్యలతో నిండియున్నవని యిక్కడ ఉన్న సభ్యులందరికినీ తెలిసినవిషయమే. ఆంధ్రలో teachers విషయములో గాని, village officers విషయములో గాని, N. G. O. ల విషయములో గాని ప్రభుత్వము సమగ్రమైన ధోరణిని అవలంబించి యీ మూడు వర్గాలవారిని సంతృప్తిపరచే విధములో ఉంటుందని మేమందరము అభిప్రాయ పడుతున్నాము. కాని ఇటీవల టీచర్సు అసోసియేషన్ పైన వెలువడిన ప్రభుత్వ అభిప్రాయము, N. G. O. ల విషయములో కనబరచిన ప్రభుత్వ దృక్పథము, Village Officers విషయములో ప్రభుత్వ ధోరణి, యిందులో యేదీకూడ సభ్యులను సంతోషపరిచేటట్లుగా లేదని నేను చెబుతున్నాను. Village Officers విషయములో ప్రభుత్వము ఒక కమిటీని వేసింది. ఆ కమిటీ రిపోర్టు రెండు మాసములలో కావాలంటున్నది. కాని ప్రభుత్వము యీ విషయములో కమిటీకి అందచేసిన questionaire ను యీ రెండు మాసముల గడువులోగా పూర్తిగా విచారించి, రిపోర్టును పూర్తి వివరాలతో అందజేయగలదా అనే అనుమానము నాకు కనబడుతున్నది. ఈ, రిపోర్టు సమగ్రమైన రిపోర్టుగా రావాలంటే, యీ రెండు మాసములు చాలవు. కనీసము ఆరుమాసములైనా పట్టుతుందని మేము అభిప్రాయపడుతున్నాము. ఈ ఆరునెలలలోను V. Os. యొక్క

అభిప్రాయములు, సమస్యలు, కోరికలు ఏ విధముగా వుంటాయో, అందులో వారి వైఖరి ఏమైనా మారగలదేమో, యివి అన్నీ విచారించి రిపోర్టును అందజేయవలసి ఉన్నది. కాని Village Officers అందరికీ నేను ఒక మనవి చేయదలచాను. ప్రభుత్వమువారు వేసిన కమిటీతో సహకరించి, వారికి కావలసిన వివరాలన్నీ యివ్వమని V. Os ను కోరుతున్నాను. ప్రభుత్వము కూడ యీ Village Officers, గ్రామాలలో ప్రభుత్వ ద్రవ్యము వసూలుచేయటానికి పునాదులవంటివారని గుర్తించాలి. వారు పారంపర్యముగా యీ ఉద్యోగాలు నిర్వహిస్తూన్నారు. వారికి యిప్పటివరకు ప్రభుత్వము యిస్తూఉన్న జీతాలు చాలా కొద్ది. కాని వారు చేయవలసిన పని మాత్రము చాలా ఎక్కువ అయిపోయింది. బాధ్యతలు కూడ పెరిగినవి. కాబట్టి వారియొక్క సమస్య చాలా పెద్దదని, ప్రధానమైనదని భావించవలసి యున్నది. కాబట్టి ప్రభుత్వము Village Officers విషయములో త్వరపడి నిర్ణయములు చేయడము మంచిదికాదు. Village Officers ను కూడ యీ కమిటీని హృదయపూర్వకముగా సహకరించవలసిందిగా కోరుతున్నాను. ప్రభుత్వముకూడ యీ కమిటీని సహకరించే సందర్భములో Village Officers కుగూడ తగినసౌకర్యాలు ఏవైనాఅవసరమో అవి అన్నీ కలుగజేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ప్రభుత్వము Land Reforms ను ప్రవేశించపెట్టి, వాటిని అమలుజరుపబోతున్నామని అంటున్నది. ఈ విషయములో ఎవరికిగాని, యిక్కడ సభ్యులకుగాని, ప్రజలలోగాని ఎట్టి భిన్నాభిప్రాయాలుకూడ లేవు. ఇవి రావాలని అందరు కోరుతునేఉన్నారు. కాని కొంతమందికి విభిన్న అభిప్రాయాలు ఉన్నట్లు ఒకవర్గాన్ని ప్రత్యేకంగా శిక్షించే కక్షతో యీ land reforms ను ప్రభుత్వము ప్రవేశ పెట్టబోతున్నారన్న అభిప్రాయము యీ వేదికమీదనుంచి కొందరి సభ్యులు మాట్లాడుతు వెలిబుచ్చారు. కాని ప్రభుత్వమునకు అలాంటి దృక్పథము ఉన్నట్లు కన్పించదు. అలాంటి దృక్పథము ఏమీ లేదుగాని ఇప్పుడు మన కొండయ్యచౌదరిగారు చెప్పినట్లు లక్షలు, కోట్లు ధనము కలిగిన వర్తకులు అందరి ఆస్తిపైన సీలింగు ఏర్పాటుచేయమని అన్నారు. అది సమంజసమైనదే. అదిగూడ జరగవలసి యున్నది. అయితే ఆ విషయము ఏర్పాటు చేసేవరకు యీ land reforms ను ప్రవేశపెట్టడము వాయిదా వేయాలని అనుకోవడము, ఆదృక్పథముకూడ సమంజసము కాదని నా అభిప్రాయము. అన్నికూడ జరగవలసిందే. ఇక్కడ వ్యవసాయరంగములో feudalistic పద్ధతి వారు గమనించామని, ప్రజలు అనుకున్నంతగా కాదని, దానికి సరియైన అర్థము గ్రహించవలసి యున్నదని అన్నారు. ఏమైనప్పటికినీ land reforms కావాలని అంటే, ceilings కూడ కావాలి. Ceilings విషయములో అందరికీకూడ ఏకాభిప్రాయము ఉన్నదని అన్నారు. అటు కాంగ్రెసుసభ్యులు అయితేనేమి,

Planning Commission వారు అయితేనేమి, యిటు యింకా యితర సభ్యులు అయితేనేమి, అందరుకూడ యీ ceilings పెట్టాలనే అభిప్రాయముతోనే ఉన్నారు. అయితే యీ ceilings పెట్టిన తరువాత రెండుఎకరాలు, మూడు ఎకరాలు యీ మాదిరిగ పంచిపెట్టినంత మాత్రాన, దానికి మరల ప్రభుత్వము ఎంతోడబ్బు రైతులకు ఎదురు పెట్టటానికి ఖర్చుచేయవలసి ఉంటుంది. అది వారి వ్యవసాయఖర్చులకు అయితేనేమి, బండి ఎద్దులు వగైరాలకు అయితే నేమి, ఎరువులు, వ్యవసాయపు పరికరములు కొనుక్కోటానికి అయితేనేమి, ఏదోవిధముగ వ్యవసాయముకొరకు పెట్టుబడిక్రింద ప్రభుత్వమే మరల వారికి లక్షలకొలది డబ్బు అందించవలసి యున్నదనికూడ కొండయ్యచౌదరిగారు చెప్పారు. డబ్బు ఖర్చుచేయవలసిన అవసరము ఉన్నప్పటికినీ, మొత్తముమీద వారికి consolidation-basis మీద, అంటే దానినే ప్లానింగు కమిషనువారు సహకార వ్యవసాయపద్ధతిపైన యీ వ్యవసాయముకూడ కొనసాగించాలని అన్నారు. దానిని consolidation అనే మనము అనుకుంటున్నాము. ఆ పద్ధతినే మనము ప్రోత్సహించవలసిన అవసరము ఉంటుంది. కాబట్టి, దానినిగురించి, అనవసరమైన తర్జనభర్జనలుగాని, లేక అనవసరమైన గందరగోళముగాని చేయవద్దని నా అభిప్రాయము. అటు భూమి consolidation కావాలి, ఇటు ceiling కావాలి. అట్లాగే యితరత్రా లక్షలకు లక్షలు బ్యాంకులలో deposits గా చేసుకొని కూర్చున్నవారి మొత్తములమీద కూడ ceiling పెట్టాలి. అట్లా చేసినట్లైతే, మంచిదేనని నా అభిప్రాయము. ఇదిగాక యీ విషయములో మరికొందరు ఏమి చెబుతున్నారంటే Distribution of wealth and property" అనే అభిప్రాయముకూడ ఉన్నది. అదికూడ సమంజస మైన ధోరణికాదు. వాటిమీద తప్పకుండా యీ ceiling అనేది ఏర్పాటుచేసి, ఒక క్రమమైన పద్ధతిన పోయే ధోరణిలో జరిగింపవలసివస్తుంది అని అందరి అభిప్రాయము. నేనుకూడ అదే అభిప్రాయములో ఉన్నాను. ఇక హరిజనా భ్యుదయ పథకములక్రింద బడ్జటులో provide చేయవలసిన ధనము గత సం॥ము కంటే యీ సం॥ము చాలా తక్కువగ ఉన్నది. కనీసము గత సం॥ము మాదిరిగానైనా యీ సంవత్సరము కూడ provide చేసి ఉంటే బాగాఉండేది. ప్రతి సం॥ ఆరు లక్షల రూపాయలు హరిజనుల house sites క్రింద ఏర్పాటు చేశారు. ఈ సంవత్సరము మూడు లక్షలే కేటాయించారు. అందులో సగం contribution కూడ లేదనే అభిప్రాయముకూడ సభ్యులు వెలిబుచ్చారు. ఇది సరియైన విధానముకాదు. సగం contribution ఎట్లా ఉన్నప్పటికినీ, గత సం॥ము యిచ్చినట్లుగా కనీసము ఆ ఆరు లక్షలు అయినను యీ సం॥ముకూడ యిస్తే రాష్ట్రములో ఉన్న హరిజనులకు కొంతవరకు సహాయకరముగా ఉంటుంది. వాళ్లుకూడ సంతోషిస్తారు. ఈ విషయమును గురించి మన ఆర్థిక

శాఖా మాత్యులు కొంతవరకు హరిజనులయందు సానుభూతి చూపించి, ఆరు లక్షలు పూర్తిగా యీ సం॥కు కేటాయించేటట్లు పునఃపరిశీలన చేస్తారని ఆశిస్తున్నాను.

ఇకపోతే ఉపాధ్యాయులగురించి ఒక్క విషయము చెప్పవలసియున్నది. మా శ్రీకాకుళం జిల్లాలో నేను యిక్కడకు, యీ శాసనసభకు వచ్చేముందు District Board Office కు వెళ్ళి తరువాత District Education Officer ను కలుసుకొని, వారితో ఉపాధ్యాయులను గురించి మాట్లాడాను. సుమారు నాలుగు వందల మంది ఉపాధ్యాయులు retrench కాబోతున్నారు అనే సంగతి మాకు తెలిసింది. ఒక్కొక్క స్థలములో వందలకొలది టీచర్లను యీ విధముగా retrench చేయబోయేటప్పుడు, వారు అందరు నిరుద్యోగులు కాబోతున్నారు. వారి సమస్య ఏ విధముగ పరిష్కారము చేస్తారు అనే విషయమును గురించి మాట్లాడి వచ్చాను. నిజానికి యీ నాడు ఎంతో మంది teachers యీ retrenchment వల్ల నిరుద్యోగులు అయిపోతారు. దేశములో నిరుద్యోగ సమస్య రాష్ట్ర ప్రభుత్వాలను, కేంద్ర ప్రభుత్వాన్ని బాధిస్తున్న సమయములో, యీ retrenchment వల్ల, యింకా యీ సమస్య అధికము అవుతుంది. ఈ సమస్యగూడ మరింత క్లిష్టస్థితికి వస్తుందని అభిప్రాయము వెలిబుచ్చవలసి వస్తున్నది. పైగా వారు 'average number of students' కోరడము కాదు. ఈ విషయములో మంత్రిగారు వాళ్ళయందు కొంత సానుభూతిని చూపించి యీ average అనేది ఏమీ లేకుండా యిదివరకు ఉన్నట్లుగానే, యథాప్రకారముగా 25 మంది విద్యార్థులతోనే సరిపోయేటట్లుగా చేయమని అంటున్నాను. ఇదివరకు ఏలాంటి G. Os ఉన్నవో, అదేవిధముగ, అదే పద్ధతిలోనే, ముఖ్యంగా ఈ elementary education విధానములో ప్రభుత్వము యొక్క దృక్పథము మార్చుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను - ఇక Planning Minister గారు త్వరలోనే గ్రామాలలో అనేక అభివృద్ధి కార్యక్రమములు ప్రవేశపెట్టబోతున్నారు. దేశము యొక్క స్వరూపమే మార్చివేయాలని ప్లానింగు కమిషనువారి అభిప్రాయమైనట్లు కనబడుతున్నది. అయితే యీప్లానింగుకు సంబంధించిన పనులు మనకు, దేశానికి చాలా అవసరమైనవి గనుక మనము దేశమును ముందుకు త్వరలో తీసుకుని రావలసిన బాధ్యత మన అందరి మీదఉన్నది గనుక దీనిని బలపరుస్తున్నాను. అయితే యీ సందర్భములో మరల నిరుద్యోగ సమస్య యిక్కడ కూడ వస్తున్నది. ఇది ఎక్కడ పట్టినను బాధిస్తూనే వెంటబడుతున్నది. గ్రామాలలో uncultivated గా ఎంతో భూమి ఉన్నది. అదిగాక educated unemployment అనేది ఎక్కడ పట్టినా, దేశములో ఏ మూల చూచినా, ఎక్కువగా కన్పిస్తున్నది. ఇది విపరీతముగ పెరిగిపోయింది. Employment Exchange Offices కు పోతే అక్కడ register చేసుకుంటారు

గాని, ఆ ఆఫీసు చుట్టూ పదిసార్లు, నెలలు, సంవత్సరాలు, తిరగవలసి వస్తున్నది గాని, పనిదొరకడమనేది కన్పించదు. ఏదో ఎప్పుడో 9 (A) (1) Candidates గా తీసుకుంటారు. అందులో నూరుగురికి ఒకరు, యిద్దరు. ఆ యిచ్చేవి కూడ యాక్టింగులు, టెంపొరరీలు. చిన్న చిన్న ఉద్యోగాలు - అంటే జమానులు వగైరాలు. అంతకంటే పెద్దవి లేవు. వచ్చినా దొరకవు. రాను రాను యీ నిరుద్యోగ సమస్య చాలా తలనొప్పి అనిపిస్తూన్నది. ఈనాడు ఉద్యోగము కాకుండా బాధపడేవారు లక్షలు, కోట్ల మంది వున్నారు. ఇక వీరందరికి ఎప్పటికి ఉద్యోగములు లభిస్తాయి ? ఈ సమస్య పరిష్కారము ఎన్నటికి సాధ్యమవుతుంది ? S. E. Os. అనో, Village Level Workers అనో, యింకా ఏదో యిచ్చి యీ సమస్యను పరిష్కారము చేయటానికి ప్రభుత్వము కూడ చర్యలు తీసుకుంటున్నారని మనకు తెలుసు. అయినను యింతమందికి ఉద్యోగములు ఏ విధముగా ప్రభుత్వము సంపాదించి పెట్టగలదో ఆలోచించవలసిందిగా కోరుతున్నాను. ఒక సమగ్రమైన పథకము ప్రభుత్వము వేసి దాని ద్వారా యీ నిరుద్యోగ సమస్య పరిష్కారము చేయటానికి మంత్రి వర్గము ఆలోచించాలని అంటున్నాను. దానికి ఒక్కటే మార్గము ఉన్నది. రాష్ట్రములో చిన్న చిన్న industries అనగా small scale industries, ఎన్నో ఉన్నవి. అవి మాత్రమే గాకుండా భారీ పరిశ్రమలు యింకా ఎక్కువగ అభివృద్ధి చేస్తే educated classes లోని unemployment చాలా మట్టుకు తేలిపోతుంది. అక్కడనే labour సమస్య కూడ పరిష్కారము కావటానికి అవకాశము ఉన్నది Land Reforms ద్వారా ప్రజలకు చాలా తక్కువ భూమి ఉంటుంది గనుక వ్యవసాయ కూలీల సమస్య కూడ పరిష్కారము చేయవచ్చును. Educated unemployment మాత్రము పరిష్కారము చేయటానికి రాష్ట్రములో ఉన్న భారీపరిశ్రమలు త్వరలో అభివృద్ధి చేస్తే, వాళ్ల అందరికీ ఉద్యోగము యిస్తే యీ సమస్య చాలా భాగము పరిష్కారము అవుతుంది. ప్రభుత్వానికి గూడ కొంతవరకు యీ విషయములో బాధ తప్పి పోతుంది. అధ్యక్షులవారు నాకు టైము అయిపోయిందని అన్నారు గనుక యింతటితో సెలవు తీసుకుంటున్నాను.

*శ్రీ బి. శ్రీరామమూర్తి : అధ్యక్షా, ప్రభుత్వానికి ప్రత్యేకించి ఒకలక్షణము, లక్ష్యం అంటూ లేదు. ఒకప్పుడు రామరాజ్యం స్థాపిస్తాము అనిచెప్పారు. తరువాత సర్వోదయంఅన్నారు. తరువాత Welfare State సంపాదిస్తామన్నారు. తరువాత 'Socialistic pattern of Society' అన్నారు.అది 'Socialistic pattern' క్రింద మారింది. ఎందుకు ఇన్ని విధాలుగా మారింది అంటే, అన్నిటికి ఒకటే అర్థం అన్నారు, ఇదే ప్రభుత్వంలో ఉన్న అనర్థం. అందుచేత దీనికి ఒక్క కానీ కూడా ఇవ్వాల్సిన అవసరంలేదు. ఎవరో సామాన్య శ్రమజీవి సీత శీలాన్ని

శంకిస్తూ మాట్లాడితే- ఏ సీత కోసం రాముడు తన యావజ్జీవితం ధారపోశాడో ఆ సీతను ఒక్క మాటతో అడవికి పంపించవలసిన పరిస్థితి ఏర్పడింది. కాని రామ రాజ్యాన్ని స్థాపిస్తామని చెప్పిన కాంగ్రెసు ప్రభుత్వ అధినేతలలో ఎన్ని మాటలు అన్నా, ఎంతమంది గోలపెట్టినా వినేదాత లేడు. వీరికి ఎన్ని విమర్శలు చేసి నప్పటికి కుంభకర్ణుడికి ఒక నల్లి కుట్టినట్లు అవుతుంది. అందుచేత ఈ ప్రభుత్వంలో రామరాజ్యం వస్తుందనేటటువంటి నమ్మకంలేదు.

ఇక Welfare State అంటున్నారు. అది కూడా ఆలోచనచేద్దాము. Welfare State అనే concept ఏమిటో ప్రభుత్వ అధినేతలకే తెలియదని అభి ప్రాయపడుతున్నాను. ఈ concept కావాలని కోరుతున్న దేశాలలో old age pensions, free medical and health insurance మొదలైనవి ఉన్నాయి. unemployment insurance కూడా ఉన్నది. ఈ దేశంలో అది ఎక్కడైనా ఉన్నదా ? దేశంలో వృత్తి, ఉపాధులు లేనటువంటి నిరుద్యోగుల శాతం ప్రతి నిత్యము పెరుగుతోంది. ఒక ప్రక్క నుంచి అభివృద్ధిపనులు సాగుతున్నాయి. రెండో ప్రక్క అనాథుల సంఖ్యకూడా పెరుగుతోంది. కండ కరగించినా కడుపు నిండనటువంటి పరిస్థితి దేశంలో పెరిగిపోయింది. ఠెక్కలు విరుచుకున్నా పని పుట్టని పరిస్థితి వచ్చింది. పదవులను పూజిస్తూ, అధికారాన్ని ఆరాధిస్తూ కేవలం ధనానికి దాసులయ్యేటటువంటి నాగరికతను నిర్మిస్తున్నటువంటి ఈ ప్రభుత్వం శ్రమకు విలువలేనటువంటి రాజ్యాన్ని స్థాపించినట్లయితే దానికి శ్రేయోరాజ్యం అనిపించుకొనే అర్హతఉండదు.

వైద్య సహాయం తీసుకొందాము. మొత్తం 30 వేల మందికి ఒక వైద్య శాలను కూడా నిర్మించలేనటువంటి ప్రభుత్వం ఇది అని ముఖ్యమంత్రిగారే స్పష్టంగా తెలియపరిచారు.

విద్య విషయంలో చూస్తే విద్యార్థులు ఇచ్చే జీతాలు పెరిగాయి. విద్యా సౌకర్యాలు పెరగలేదు. Single teacher schools పెట్టారు, ఉపాధ్యాయుడు ఉంటే విద్యార్థులు ఉండరు. విద్యార్థులు ఉంటే ఉపాధ్యాయులు ఉండరు. ఇద్దరూ ఉంటే school building ఉండదు. ఈ పరిస్థితులలో ఏరకంగా శ్రేయో రాజ్యం అవుతుందని నేను ప్రశ్నిస్తున్నాను. శ్రేయోరాజ్యం కాదుగదా కనీసం Socialist రాజ్యం అవుతుందా అని ప్రశ్నిస్తున్నాను.

దేశంలో ముఖ్యంగా ప్రభుత్వరంగంలో అసమానత్వం విపరీతంగా పెరిగున్న పరిస్థితులలో సామ్యవాదం గురించి మాట్లాడేందుకు ప్రభుత్వానికికూడా అర్హత లేదనే స్పష్టమైన అభిప్రాయాన్ని కలిగిఉన్నాను నేను. Elementary School లో పనిచేస్తున్న ఉపాధ్యాయునకు ఒకరకం జీతం ఉంటుంది. Aided Elementary School లో పనిచేస్తున్న Master గారికి ఒకరకం జీతం ఉంటుంది. Govern-

ment School లో పనిచేసే ఉపాధ్యాయులకు ఇంకోరకం జీతం ఉంటుంది. ఎక్కడఉంది సమానత్వం ? తెలంగాణాలో పనిచేస్తున్నటువంటి ఉద్యోగులకు ఒక జీతం ఉంటుంది. ఆంధ్రలో పనిచేస్తున్నటువంటి ఉద్యోగులకు ఇంకో జీతం ఉంటుంది. Equal pay for equal work అనే ప్రాథమిక సూత్రాన్ని కూడా పాటించని పరిస్థితిలో Socialism ను గురించి మాట్లాడితే ప్రయోజనంఉండదు. ఆఖరికి జైలుకుపోయినా, సమానత్వంలేదు. అక్కడ కూడా 'A' Class, 'B' Class, 'C' Class తయారౌతాయి. ప్రభుత్వం సమానత్వాన్ని సాధించడానికే అవకాశంలేదు. అడుగున ఉన్నటువంటి మనిషికి 30 రూపాయలు జీతం ఉంటే, మీద ఉన్నటువంటి మనిషికి 3000 రూపాయలు జీతం ఉంటుంది. 1:100 నిష్పత్తిలో దేశంలో ముఖ్యంగా ప్రభుత్వరంగంలో ఉన్న ఉద్యోగస్థుల రాబడి ఉంటున్నది. 1000 రూపాయలకు మించిన maximum ఉండడానికి వీలులేదని ముఖ్యమంత్రిగారు చెప్పారు. అది ఏమిటి అని గట్టిగా ప్రశ్నిస్తే 'కల' కిందో, 'ఆశ' కిందో, 'నిష్ఫలమైన నిట్టూర్పు' కిందో వారు సమాధానం చెప్పడానికి ప్రయత్నంచేశారు. స్పష్టంగా ఒక నిర్ణయం తీసుకోవాలి. Socialism ను స్థాపించడానికి పూనుకొన్న ప్రభుత్వంగా పరిగణించాలన్నట్లయితే, ఆ లక్ష్యానికి పోయే మార్గాలను, పద్ధతులకు కావలసిన పథకాలను వేసినట్లయితే కొంత డబ్బు కేటాయించడంలో సబబు ఉంటుంది. అది లేనపుడు ప్రయోజనం ఏమీ కనబడదు. Land reforms విషయం తీసుకొన్నట్లయితే ceilings ఉండడానికి వీలులేదనికొందరు, కావాలని కొందరు అంటున్నారు.

Irrigation Schemes విషయంలో విశాఖపట్నం జిల్లాను చాలాకాలం నుంచి అన్నివిధాల వెనక్కు తొక్కుతున్నారు. ఈనాటికైనా ప్రభుత్వం తమ దృక్పథాన్నిమార్చుకోవాలనికోరుతున్నాను. బిడ్డకు దక్కనటువంటి స్తన్యము లాగా నదులు ప్రవహిస్తున్నాయి. ఎండిపోయి, పగిలిపోయినటువంటి గుండెల లాగా పొలాలు ఉన్నాయి. కాని ప్రభుత్వం తాలూకు హృదయంలో మార్పేమి కనపడదు. ఈ పరిస్థితి ఎంతకాలం కొనసాగుతుందని అడుగుతున్నాను. ఈరోజు కైనా విశాఖజిల్లాను అణగద్రొక్కడానికి చేసే ప్రయత్నాన్ని ప్రభుత్వం విరమించి ఆ జిల్లాలో, అభివృద్ధి ప్రణాళికలను, irrigation ప్రణాళికలను అమలుచేయాలని కోరుతున్నాను.

చర్చల స్థాయిని గురించి ఒక విషయం మనవిచేయదలచుకొన్నాను. చర్చల స్థాయి కొంచెం ఉన్నతంగా ఉండాలి. హుందాగా, ఠీవిగా ఒక పద్ధతిలో మనం చర్చలు సాగించాలి. కాని అలా జరగడంలేదు. ముఖ్యమంత్రి అంత బాధ్యత ఉన్నటువంటి మనుష్యులు మనవాళ్ళు పిచ్చివాళ్ళని శాసనసభలో ఉపన్యాసంచేస్తున్న పరిస్థితులలో క్రొత్తగా శాసనసభకువచ్చిన నేను ఎంతవరకు

విలువ ఇవ్వగలుగుతాను? కనుక వీటి స్థాయినిమాత్రం పెంచండి. అది లేకపోతే ప్రయోజనంలేదు. ఒక మనిషిని తూలనాడే అధికారం మంత్రులైనంతమాత్రాన ఉన్నదని అనుకోరాదు. వ్యక్తిగతంగా నిందించి, దూషించుకుంటే ప్రయోజనం లేదు. ఒకరు మంచివారని, ఒకరు చెడ్డవారని అనుకోడానికి వీలులేదు. ఇది రామాయణంకాదు. రామాయణంలో ఒక్కప్రక్క మంచివాళ్ళు ఉంటారు, ఇంకొకప్రక్క చెడ్డవాళ్ళు 'రావణుడులాంటి'వాళ్ళు ఉంటారు. అందుచేత ఇది రాముడు ఒకప్రక్క, రావణుడు ఒకప్రక్క ఉన్న పరిస్థితి కాదు. ఇది భారతం అని నేను అనుకొంటున్నాను. ఇందులో మంచిచెడ్డ రెండు కలిసేఉంటాయి. వ్యక్తిగతమైన పరిశీలన, పరీక్ష, విమర్శ అవసరంలేదు. ప్రజాస్వామ్యంలో కావలసినది సంఖ్యాబలం ఒక్కటేకాదు. ఇంకొకటి కూడా ఆలోచనచేయాలి. భారత యుద్ధంలో దుర్యోధనుని తాలూకు సంఖ్య విపరీతంగా ఉన్నప్పటికి, అంతిమ విజయం సంఖ్యాబలంమీదనే ఆధారపడలేదు. న్యాయము, ధర్మము, నీతి విజయాన్ని పొందగలుగుతాయి. Majority ఉన్నదని భ్రమపడి అన్యాయము, దౌర్జన్యము చేయడానికి వీలులేదని సవినయంగా మనవిచేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

*శ్రీ రాజాసాగి సూర్యనారాయణరాజు (నరసీపట్నం-జనరల్): అధ్యక్షా. Appropriation Bill ను నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను. Planning విషయంలో నాకుతెలిసిన అంశాలపై నా అనుభవాన్ని మనవి చేస్తున్నాను. Planning విషయమై చాలామంది చాలరకాలుగా సెలవిచ్చారు కాని అలా సెలవిచ్చినవారిలో కొందరికి అనుభవం ఉన్నది. కొందరికి లేదని అనుకుంటాను. సరిగాపనులు జరగలేదని కొందరు అంటారు. Government ఇచ్చినడబ్బు సక్రమంగా ఖర్చుకాలేదని కొందరుఅంటారు. అలాఅనేవాళ్ళెవరూ కూడా కష్టపడి పనిచేయడం లేదేమోనని నేను అనుకొంటాను. నా నియోజక వర్గంలో 3 బ్లాకులు వచ్చాయి. బ్లాకులు వచ్చాయని, పనిచేయలేదని విమర్శించే కన్న అక్కడికివెళ్ళి మన ఉద్యోగస్థులతోను, ప్రజలతోను కలిసి కష్టపడి పనిచేసి నట్లయితే సవ్యంగా, సక్రమంగా పనిజరుగుతుందని నేను గుండెలమీద చెయ్యివేసుకొని ధైర్యంగా మనవిచేస్తున్నాను. ఎందుచేతనంటే, నా బ్లాకులలో ఇదివరకుఇచ్చిన డబ్బుగాక ఇంకాఎక్కువడబ్బు కావాలని నేను అనేకసార్లు ముఖ్యమంత్రిగారితోను, అక్కడకి దయచేసిన మంత్రులందరితోనుకూడా మనవి చేసుకుంటున్నాను. క్రొత్తపథకాలకోసం ప్రయత్నంచేసినప్పటికి నాకుఅనుకూలం కాకపోవడంవల్ల చాలబాధపడుతున్నాను. ఉరట్లబ్లాకులో 54 గ్రామాలు ఉన్నాయి. 54 గ్రామాలకు ఇంచుమించుగా రోడ్లు తయారైనాయి. ప్రజలు శ్రమదానంచేసి రోడ్లు పూర్తిచేసినప్పటికి, allot చేసిన డబ్బుచాలక metalling

చేయించుకోడానికి అవకాశం లేని పరిస్థితిలో ఉన్నాము. కనుక ఇకముందు ఈ స్కీములలో ఉత్సాహంగా, ఎక్కువ పనిచేసిన block లకు అవకాశం కలుగజేస్తారని ఆశిస్తున్నాను.

క్రొత్తపన్నుల విషయమై Member లందరిని ఆలోచించమని ఆర్థిక మంత్రిగారు సెలవిచ్చారు. ఏపన్నులు వేసినా అభ్యంతరంలేదని మొట్టమొదట రోజునే మనవిచేశాను. పన్నులు వేసినప్పటికి పనులుజరగాలని కోరాను. ప్రత్యేకంగా రైతులమీదనే పన్నులువేయాలని ఒక వర్గం, వేయకూడదని ఒక వర్గం, ఇతరులమీదమాత్రం పన్నులులేవా అని మంత్రివర్గం అనడం భావ్యంకాదు. ఎక్కడ అవకాశంఉంటే అక్కడ ఎక్కువపన్నులు వసూలుచేసి ఆర్థికలోపాన్ని తీర్చి, పనులు ఎక్కువ చేయాలని నేను కోరుతున్నాను. (Interruption) వేరు సెనగ, వర్జీనియా పంటలు ఉన్నాయికదా! ఆ పంటలమీద పలురకాల పన్నులు వేయించండి. ఇతర రాష్ట్రాలలోకన్న మన రాష్ట్రంలో నీటితీరువా చాల తక్కువగ ఉన్నదని అంటున్నారు. అది కొంచెము జాస్తీచేయవచ్చు. అందుచేత ఏవిధమైన పన్నువేసినా అభ్యంతరంలేదని మనవిచేస్తున్నపుడు మళ్ళీ నన్నే సలహా అడగడం భావ్యం కాదేమోనని నేను మనవిచేస్తున్నాను.

భూసంస్కరణల విషయంలో నేను కొంచెం చెబుతాను. ఈ విషయమై అనేక మంది సభ్యులు అనేకవిధాల అభిప్రాయాలను వెలిబుచ్చారు. కాని కొండయ్య చౌదరిగారు చెప్పిన విషయం సబబుగా ఉన్నదని నేను అనుకోవడం లేదు. 100 ఎకరాల భూమో, 10 ఎకరాల భూమో limit పెట్టదలచు కొన్నప్పుడు ఆ limit ను దాటి భూమి ఉన్నవారు యికముందు భూమిని సంపాదించుకోకుండా వారి పుత్రులకు, సోదరులకు, కుటుంబస్తులకు పంచుకొనే అవకాశం కలుగజేయాలి. ఇంకపైన భూమి కొనుక్కోకుండా ceiling పెట్టాలి గాని, ఒకరి భూమి తీసుకువచ్చి మరొకరికి ధారబోస్తే, అట్లా యిచ్చిన తరువాత అది స్థిరంగా వుండదు. అట్లా యిదివరకు ఎవరైనా ఉన్నారా? బాగుపడ్డవారెవరైనా ఉన్నారా అని ప్రశ్నిస్తున్నాను. గ్రామ కరణాల, మునసబుల జీతాల విషయమై యీనాడు మన రాష్ట్రంలో పెద్ద అలజడి యున్నది. పూర్వం గ్రామ మునసబులకు, కరణములకు చాలా ఈనాములు యిచ్చినారు. కాని వారికి ఖర్చులు ఎక్కువ అగుటవలన ఆ భూములను అమ్మి కొని తనఖాలు పెట్టి, యిప్పుడు యేమీలేని స్థితికి వచ్చినారు. వారు చాల బాధ పడుచున్నారు. ఏ పై ఉద్యోగస్తుడు గ్రామమునకు వెళ్ళినా, గ్రామ ఉద్యోగస్థులు వారికి భోజనవసతులు కల్పించి తగిన మర్యాదలు చేయుటలో చాలా అవస్థపడుతున్నారు. ఇపుడు వారికి యిచ్చే జీతాలు చాలవనే సంగతి అందరికి తెలుసు. మన రాష్ట్రంలో కోట్లకొలది ఎకరములు బంజరు భూమి యున్నది. ఆ

భూములను పేదవారికి యిస్తున్నారు. ఆ భూమిలో కొంత భాగం ఈ గ్రామోద్యోగస్తులకుగూడ ఇచ్చి, వారిని ఎందుకు సంతృప్తిపరచగూడదని ప్రశ్నిస్తున్నాను.

హరిజనులకై కేటాయించిన డబ్బు విషయమై చాలామంది సభ్యులు చెప్పారు. వారు చెప్పినదానితో నేను ఏకీభవిస్తున్నాను. హరిజనులకు యిళ్ళ స్థలాలు యివ్వడంలో "half contribution" అని చెప్పడం సబబుగా లేదు. ఆ విధంగా యివ్వడానికి అవకాశం ఉండదు. ఇట్లా అయితే హరిజనులు ఈ అవకాశాన్ని పొందలేరు. ఏమీ 'contribution' లేకుండా యిళ్ళ స్థలాలు యిచ్చినప్పటికీ, వారు యిళ్ళు కట్టుకొనలేని స్థితిలో ఉండగా, "half contribution" యిచ్చి యిళ్ళు కట్టుకోమంటే, కట్టుకోగలరా, లేదా, అనే విషయంగూడా ఆలోచించాలని కోరుతున్నాను. 10 సంవత్సరముల నుండి ప్రయత్నం చేయగా-యిప్పటికి 230 యిళ్ళ స్థలాలు సంపాదించుకోగలిగారు. కానీ యిండ్లు కట్టుకోడానికి చాలా ఇబ్బంది పడుతున్నారు. 500 రూ. స్కీములో 200 రూ. అప్పుగాను, 200 రూ. గ్రాంటుగానూ యిచ్చేపద్ధతిలో యిండ్ల స్థలాలు యిచ్చే యేర్పాటు చేయవలయునని కోరుతున్నారు. నిన్న, ఒక సోషలిస్టు మెంబరుగారు అంటరాని తనమునుగూర్చి మాట్లాడుతూ, అసలు జాతే ఉండగూడదని తెలిపినారు. జాతే ఉండకూడదంటే అర్థమేమిటాయని నేను 5, 6 రోజులనుంచి ఆలోచించుచున్నాను. జాతి మనుషులలో యుండ గూడదా, భగవంతుని సృష్టిలోనే యుండగూడదా, అని ఆలోచించాను. సృష్టిలో చూద్దామంటే - ధాన్యం, వేరుశనగ, చెరుకు మొదలగు అనేక రకాల జాతులు ఉన్నాయి. పశులలో గూడ జాతులు ఉన్నాయి. జంతువులలోగూడ జాతులు ఉన్నాయి. (Interruption.) రూపాలు సమానంగానే యున్నాయి. వారికి తెలియదనుకొంటాను. తెలుసుకొంటే బాగుంటుందని మనవిచేస్తున్నాను.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (కమ్మం - జనరల్): జాతులు వేరు వేరుగా యున్నా వాటికి కలిగించే చైతన్యం ఒకటే గాబట్టి అంతా ఒకటే అవుతుంది.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు: అందుచేత M. A ప్యాసయిన వారు, B. L. ప్యాసయినవారు గూడ ప్లీడరు ప్రాక్టీసుచేస్తూ లక్షలకొలది రూపాయలు గడిస్తున్నారు. కొందరు ఒక్క రూపాయి గూడ సంపాదించకుండా యింటిదగ్గర కూర్చుంటున్నారు. అందువలన వారిలో గూడా తేడాలు ఉన్నాయన్న సంగతి సభ్యులు తెలిసికొనవలెనని మనవిచేస్తున్నాను.

మనము జంతువులనన్నింటినీ గూడ అభివృద్ధిచేయడానికి ప్రయత్నం చేస్తున్నాము. పశువులు, కోళ్ళు, కుక్కలు మీటి అభివృద్ధికొరకు "Agriculture, Veterinery Departments" పనిచేస్తున్నాయన్న సంగతి అందరకూ తెలుసును.

లోహాలలో బంగారము, ఇనుము, ఇత్తడి మొదలగునవి ఎన్నో రకాలు ఉన్నాయి. వీటన్నింటిలోనూ తారతమ్యాలు ఉన్నాయి. అందుచేత మానవులలో జాతి లేదనుట అసంభవము. అంటరానితనాన్ని తొలగించుటకు ప్రయత్నించాలి గాని, జాతినే కొలిపోవుట సర్వకల్ల, శుద్ధ అబద్ధం. ఈ విధంగా ఎప్పటికీ జరుగ దని మనవిచేస్తున్నాను.

*శ్రీ జి. నారాయణరెడ్డి (అసిఫాబాద్-జనరల్) : అధ్యక్షా, ఆర్థికమంత్రి గారు బడ్జటు ప్రవేశపెట్టేటప్పుడు, అది లోటుబడ్జటు అని చెబుతూ, ఆ లోటును భర్తీ చేయడానికి సలహాఇవ్వాలని సభ్యులను కోరినారు. మన ఆర్థికమంత్రిగారు ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో ఉన్నప్పటినుంచీ మంత్రిగా పనిచేస్తున్నారు. వారికి దేనికయినా ఆదాయం వస్తుందనేసంగతి తెలియదా? అనేకలక్షల, కోట్లకొలది ఎకరములభూమి బీడులుపడి ఉన్నది. అట్టి అడవి భూములమీద ఏవిధంగానూ ఒక్క అణాకూడ ఆదాయం రావడంలేదు. ప్రభుత్వంవారు కో ఆపరేటివ్ సొసైటీలను ఏర్పాటుచేసి ఆ భూములను బీదలకు యిచ్చినట్టయితే కొంత ఆదాయం వస్తుంది. ఎకరం ఒక్కంటికి 8 అణాలో, 12 అణాలో లేక 1 రూపాయిఅయినా వారు పట్టాదారులకు చెల్లిస్తూ ఆ భూములను చేసుకుం టూరు. కొండయ్యచౌదరిగారు మాట్లాడుతూ "కమ్యూనిస్టులు ఎక్కువ భూమి గలవారినుండి ఆ భూములను తీసికొని పేదలకు యివ్వాలన్నారు" అన్నారు. అయితే పేదవారు పేదవారుగానే ఉండాలా? ప్రతిపక్షసభ్యులు మాట్లాడక పోతే ప్రభుత్వానికిమాత్రం తెలియదా! అణాకూడా ఆదాయంరాని భూము లను లక్షల, కోట్లకొలదీ పడివున్న భూమిని, కొన్నిలక్షల కుటుంబాలకు యివ్వ వచ్చు. అట్లాచేస్తే ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. పేదప్రజలకు ఉపయోగ పడుతుంది. ప్రభుత్వం వేలకొలదీ రూపాయలు ఎందుకు ఖర్చుపెట్టాలి? ఈనాడు మనం అంతో, యింతో, పెట్టుబడిపెట్టి వ్యవసాయం చేసుకోడానికి అవకాశం ఎట్లా కలిగిందనే విషయంకూడా మనం ఆలోచించాలి. పేదప్రజ లకు భూమి యిచ్చినట్లయితే వారు అప్పుగాగాని, మరేవిధంగానైనా డబ్బు తెచ్చుకొని సాగుచేసుకుంటారు. అడవిభూముల విషయమై లోగడ ప్రభుత్వంచేసిన అనేకచట్టాలున్నాయి. ఇంగ్లీషువారి పరిపాలనాకాలంలో చేసిన విధానాలలో మార్పు రావలసియున్నది. అందుకుఇప్పటికీ మనప్రజాప్రభుత్వంకృషి చేస్తున్నట్లు కన్పించదు. ఆలిండియా స్కీములో మేకలమేతకు పుల్లరి ఆపుచేయబడినది. మేకలపైన పుల్లరి వసూలు చేసినట్లయితే ప్రభుత్వానికి కొన్నిలక్షల రూపాయల ఆదాయం వస్తుంది. పుల్లరి వసూలుచేయడం మానినంతమాత్రాన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మేకలులేకుండా పోయాయనుకోరాదు. మేకలు ఎక్కడకూ పోలేదు, ఉంటూనేఉన్నాయి. ఈ సందర్భంలో డబ్బు సంపాదించుకోగల్గినే

ఉద్యోగులు సంపాదించుకుంటున్నారు. ప్రజలదగ్గరనుంచి డబ్బు వస్తూనేఉన్నది. కాని ఆంధ్రప్రభుత్వానికి రాకుండాపోతోంది. ఇప్పటికికూడా బంజరుభూములు, ఇతర పోరంబోకుభూములు యివన్నీ ఆలిండియాస్కీము వశం చేసుకోవడం జరుగుతోంది. All India Scheme అనేపేరుతో చెట్లుకొట్టి వశపర్చుకోవడం జరుగుతున్నది. అందువల్ల ప్రభుత్వంవారు వెంటనే Co-operative Societies ను ఏర్పాటుచేసి ఇటువంటి భూములన్నింటినీ ఆ సొసైటీలకు యివ్వాలని మనవి చేస్తున్నాను. దీనివిషయమై బడ్జట్‌లో కేటాయించినడబ్బు సద్వినియోగం అయ్యేటట్లుగా చూడాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు దగ్గర పరిస్థితులు కొన్ని నాకు బాగా తెలుసును. అక్కడి కంట్రాక్టరులు రెండు సంవత్సరాల నుంచీ పనులు చేస్తున్నారు. ఆ కంట్రాక్టరులను బ్రిటిష్ ప్రభుత్వంవారి కాలంలో (A) Class, (B) Class, (C) Class, (D) Class - అని 4 Classes గా ఏర్పాటుచేశారు. ఆ కంట్రాక్టరులకు యిప్పటికి కూడ P. W. D. నుంచి works యివ్వబడుతున్నాయి. అయితే నాగార్జునసాగర్ ప్రాజెక్టులో ఇంజనీరుల నామినేషనులపై పనులు యివ్వడం జరుగుతున్నది. అట్లా యింజనీరుల నామినేషనుపై works తీసుకొనే contractors కొంత deposit కడుతున్నారు. Deposits కట్టినా కూడా tenders యిచ్చి తీసుకొంటున్నారు. వారికీ, వీరికీ ఏమీ భేదం లేదు. Deposits కట్టేటప్పుడు ఆ పనులు ఎవరికి యిస్తే ఏమి ? పని చేసినతరువాతనే ప్రభుత్వం డబ్బు ఇస్తుంది. ఇప్పుడు నాగార్జునసాగర్ ప్రాజెక్టు వద్ద పనులు ఆపడం జరిగింది. Nominations పైన పనులు తీసుకొనేవారికీ, tenders యిచ్చేవారికీ భేదం వుండదు. కాని నామినేషన్సు పైన తీసుకొనేవారు తక్కువ tenders యిచ్చి పనులు తీసుకోవడం జరుగుతోందని నేను అక్కడక్కడ వాకబుచేయగా తెలిసింది. Tenders యిచ్చే వారికి యిస్తే కూలీలకు సరైన కూలి లభిస్తుంది. వారికి సరైన కూలి యిస్తే ఎక్కువ డబ్బు మిగలదు. డబ్బు ఎక్కువ మిగలకపోతే ఉద్యోగులకు యివ్వడం జరుగదు. అటువంటి పరిస్థితులలో పనులు చేసినతరువాతనే ప్రభుత్వం డబ్బు యిస్తుంది. కాబట్టి ఈవిషయంలో న్యాయంచేయాలని కోరుతున్నాను. ఇంజనీరులకు డబ్బు లభించదు. కాబట్టి ఆ పనులను ఆపడం జరిగింది. ఒక యూనిట్‌పైన నామినేషన్ పైన పనిచేసేవారు deposit కట్టుతారు. (A) Class, (B) Class మొదలగు కంట్రాక్టరుల కంటె unit పైన 50 రూ. లు తక్కువ tenders యివ్వడంజరుగుతున్నది. అయితే 50 రూ.లు తక్కువ tenders యిచ్చే వారిని వదలిపెట్టి (A) Class, (B) Class contractors కు పనులు యివ్వడంవల్ల ప్రజలకూ, ప్రభుత్వానికీ, దేశానికీ కూడ నష్టంవస్తుందనే సంగతి తెల్సుకోవలసి యున్నది.

మొత్తంమీద తక్కువ ఖర్చుతో, ఎక్కువ ఉపయోగం కావాలంటే, ఆ కంట్రాక్టర్సుకు, ఈ కంట్రాక్టర్సుకు ఏవిధమైన భేదంఉండరాదు. వాళ్లుకూడా డిపాజిట్ కట్టి పనులుతీసుకొనడం జరుగుతుంది గనుక వాళ్ళుకూడా పని పూర్తి చేసినతరువాతనే డబ్బు అడగడం జరుగుతున్నది. అందువలన డిపాజిటు కట్టి పని కోరినవాళ్ళకు యివ్వవలసిందని మనవిచేస్తున్నాను. ఎక్కువ సమయము లేదు గనుక మా నియోజకవర్గమునకు సంబంధించిన రెండు మూడు విషయాలు మనవిచేస్తాను.

మా దేవరకొండ నియోజకవర్గంలో పండేది అంతా ఆముదాలపంట. అదంతా గుట్టల ప్రదేశం. అందువలన అక్కడ ఒక ఆముదాలమిల్లు కావలెనని police action తరువాత వచ్చిన ప్రతి మంత్రివర్గం వారితోను విన్నవించుకొంటూనే యున్నాము. కాని యింతవరకు అక్కడ ఆముదాల మిల్లు పెట్టడం జరగలేదు. ప్రభుత్వం కనుక చేయదలచుకొంటే, దేవరకొండకు అంతకంటే ఉపయోగమేమీ చేయబోదు. అక్కడ పండే ఆముదాలు కలకత్తా, బొంబాయి వంటి యితర ప్రదేశాలకు పోయి అక్కడ ఆముదం తయారై, యిక్కడకు వచ్చిన తరువాత ఖరీదుచేసుకొనడం జరుగుతున్నది. అందువలన ఒక మిల్లును వెంటనే అక్కడ ఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను.

తలపెట్టిన ప్రతి కార్యక్రమమూ పద్వినియోగం కావడానికి, తక్కువ ఖర్చుతో ఎక్కువ ఉపయోగమయ్యే నీటి సదుపాయాలు మొదలగు విషయాలపై ప్రభుత్వానికి చక్కని సలహాలు యిచ్చేందుకు గాను, ప్రతి District కు ఒక Committee ని ఏర్పాటుచేస్తే బాగుంటుంది. ఆ Committee యిచ్చే సలహాల వల్ల త్వరితముగా పనులు పూర్తికావడానికి కూడా అవకాశముంటుందని మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం - రిజర్వుడు): On a point of information, Sir, 27 రోజులనుంచి ఈ అసెంబ్లీ సమావేశము జరుగుతున్నది. ప్రతి శాసనసభ్యునికీ తమ తమ నియోజకవర్గముయొక్క కష్టసుఖాలు చెప్పు కోడానికి 10 నిముషాలో, 15 నిముషాలో యివ్వాలి. కాని ఆ విధంగా కాకుండా యిప్పుడు యిచ్చినవారికే 3 సార్లు, 4 సార్లు తిరిగి మాట్లాడడానికి అవకాశం యివ్వడం జరుగుతున్నది. ముఖ్యంగా వెనుకబడిన నియోజకవర్గం నుంచి వచ్చిన మాలాంటి వాళ్ళకైనా ఒక 5 నిముషాలు ఎక్కువ సమయం యివ్వవలసిందిగా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ : మీరు యిదివరకు ఎన్నిసార్లు మాట్లాడారు ?

శ్రీ పి. గున్నయ్య : Irrigation Demand పై 2 నిముషాలు ఇచ్చారు. తరువాత యింతవరకూ మాట్లాడడానికి అవకాశం యివ్వలేదు. కనుక అధ్యా

తులవారు కటాక్షించి యిప్పుడైనా 10 నిముషాలు యివ్వవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : మీరు 10 నిముషాలు కావాలని కోరుతున్నారు. గనుక మిమ్మల్ని పిలువదలచుకోలేదు. 5 నిముషాలైతే అవకాశముండేది. మీరు ప్రతిసారి 10 నిముషాలు కావాలని కోరుతున్నారు. time లేదు కనుక అంత సేపు యివ్వడానికి వీలు ఉండదు. కనుక యిప్పుడు 5 నిముషాలు సత్యనారాయణగారి తరువాత మాట్లాడండి.

శ్రీ చౌదరి సత్యనారాయణ (షేర్ మహమ్మదుపురం) : అధ్యక్షా, చీపురుపల్లి తాలూకా పూర్తిగా జమీందారీ ప్రాంతం. జమీందారులు పోయినతరువాత Government handover చేసికొని సుమారు 7, 8 సం॥ కావచ్చింది. కాని యిప్పటివరకు అక్కడ చెరువుల మరమ్మతు పూర్తిగాజరుగక చాలా అశ్రద్ధ చేయడం జరుగుతున్నది. మా షేర్ మహమ్మద్ పురంలో Block development area headquarters ఒకటి ఉన్నది. అక్కడి N. E. S, Blocks లో land improvement కొరకు కొంత loan allot చేయడం జరిగింది. కాని యిప్పుడు ఆ allotment జమీందారీ area కు యివ్వకూడదని object చేస్తున్నారు. నిన్న మంత్రిగారు 'మైనర్ యిరిగేషన్ చెరువులకు ఉపయోగించండి, ఈ land improvement కు యివ్వడానికి వీలులేదు ' అని సమాధానం చెప్పారు. కాని అది అంత సమంజసంగా వుండదు. కనుక ప్రభుత్వం ఈ విషయం తిరిగి ఆలోచించి, ఆ loans సద్వినియోగమయ్యేట్లు చేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత ఈ Co-operative Extension Officers చాలా ప్రాంతాల్లో Co-operative Societies పెడతామని కొంతడబ్బు collect చేసి, deposit చేశారు. మా Block లో మాత్రం సుమారు 20 వేల రూ॥లవరకు డిపాజిట్ చేసి ఉన్నారు. కాని ఒక్క society కూడా register చేయకుండా Central Bank వాళ్ళు చాలా ఆలస్యం చేస్తున్నారు. దానికి కారణం ఈ Central Banks లో Directors వాళ్ళు అజమాయిషీకి వారి Directorship కేమైనా భంగం వస్తుందేమోనని, 'మొనాపొలీ దృష్టితో వ్యవహరిస్తున్నారు. కనుక ప్రభుత్వంవారు ఈ Central Banks పైన సరియైన చర్య తీసుకొని, యిటువంటి Bank areas లోనైనా సంఘాలను వెంటనే register చేయించి, వారికి సకాలంలో డబ్బు అందేట్లు చేయవలసిందిగా కోరుతున్నాను. లేకపోతే అక్కడి ప్రజలలో చాలా అసంతృప్తి ప్రబలుతుంది. Extension Officers గ్రామాలవెంట వెళ్ళినప్పుడు "మాదగ్గర డబ్బువసూలుచేసి. నీవు ఏమిచేసినావు, తినేశావా ?" అని అడుగుతున్నారు. సకాలంలో వారికి డబ్బు రాలేదని చాలా నిరాశచెందుతున్నారు. కనుక ప్రభుత్వంవారు ఈ విషయాన్ని పునరాలోచిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత ఈ Block areas లో కొన్ని schools sanction చేస్తుంటే వీటికి Educational Officers చాలా అడ్డంకులు కల్పిస్తున్నారు. అప్పటికే మేము అసలు schools లేని Blocks లోనే యిన్ని schools కావాలని propose చేస్తున్నాం. కాని D. E. O. గారు, District Board వారు అది grant చేయడానికి వీల్లేదని అనేక అభ్యంతరాలు చెబుతున్నారు. అయినప్పటికీ మేము దూరంగా ఉన్నవాళ్ళకు, కావలసిన స్కూళ్ళనే propose చేసి పంపుతున్నాం. కాని D. E. O. గారు పర్మిషన్ విషయంలోమాత్రం చాలా అశ్రద్ధచేస్తున్నారు. కనుక ప్రభుత్వంవారు ఈ అత్యవసరవిషయాన్ని తిరిగిపరిశీలించవలసిందిగా కోరుతున్నాను.

తరువాత హరిజనులకు యిండ్లస్థలాలుగురించి గతసంవత్సరంలో Deputy Director of Harijan Welfare శ్రీకాకుళంజిల్లా వచ్చినప్పుడు బుడుమూరు గ్రామంవచ్చి, అక్కడ యిండ్లస్థలాలగురించి ఎంక్వయిరీచేసినారు. హరిజనులకు యివ్వడానికి ఆ స్థలం చాలాబాగుంటుందని వారు అభిప్రాయ పడ్డారు. కాని యింతవరకు వాళ్ళయిండ్లస్థలాలగురించి సమాధానమేమి రాలేదు. ఈవిధంగా రెండు, మూడు సంవత్సరాలకొకపర్యాయం వచ్చిచూచి పోవడమే గాని, యిప్పటివరకూ ఒక హరిజనుడికికూడా యిండ్లస్థలం యివ్వలేదు.

ఇక L. D. Works విషయం చూచినప్పుడు, మాచీపురుపల్లి తాలూకా చాలా మెరక తాలూకా. అక్కడ త్రాగడానికి మంచినీరు దొరకక చాలా కరువుగా యున్నది. అందువలన ప్రతిగ్రామానికి 'కనీసం ఒక మంచినీటినుయ్యి అయినా' ఉండేందుకుగాను, ఈ L. D. Works యొక్క grants ను ఎక్కువ జేసి ఆవిధంగా గ్రామాలలో మంచినీటి నూతులను ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

ఇక agriculture loans విషయంలో తహశిల్దార్లు చాలా అల్లర్లుచేస్తున్నారు. రైతులు అన్నివాయిదాలు ఒకేసారికట్టవలసివస్తున్నది. కనుక ఈ బాకీలకు డిశెంబరువరకు అయినా వాయిదావేస్తే, బాగుంటుంది. అప్పుడు రైతులకు పంటలుదగ్గరకు వస్తాయి. వారు డబ్బుకట్టుకొనడానికి అనుకూలంగా కూడా ఉంటుంది. కాని ఈ విషయంలో మనరెవిన్యూమంత్రిగారు ఆవిధంగా వాయిదాలు యివ్వడానికి వీలులేదని చెప్పడంమాత్రం చాలావిచారకరం. కనుక తిరిగి ఈ విషయం ఆలోచించి ఆవిధంగా వాయిదా వేస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, మొట్టమొదట కొంతమంది భూస్వామ్య శక్తులకు సమాధానం చెబుదామని అనుకున్నాను. కాని ఆ విధంగా

చెప్పవలసిన అవసరంలేకుండానే, ప్రతిపక్ష పార్టీలోని కొంతమంది సభ్యులు సమాధానం చెప్పారు. ముఖ్యంగా శ్రీ పున్నయ్యగారు చెప్పిన ప్రతి అక్షరంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఆ సలహాప్రకారం అమలు జరిపినట్లయితే మాకు ఏ విధమైన అభ్యంతరంలేదని నేను తెలియజేస్తున్నాను. అంతకంటే కూడా నేను ఆ భూస్వామ్య శక్తులకు చెప్పవలసిన సమాధానం ఏమీలేదు అనుకొంటున్నాను. ఇప్పుడు శ్రీ గోపాలరెడ్డిగారికి ఈ Bill pass కావడంతో 142 కోట్ల రూ.లు వారి చేతిలో వదిలిపెట్టేస్తున్నాం. వారి చిత్తంవచ్చినట్లు దానిని ఖర్చు చేయడం తప్ప మరేమీలేదు. అయితే ఏవో కొన్ని items, Demands క్రింద ఉన్నప్పటికీ, ఆ Demand కోసం కేటాయించిన మొత్తాలు, అక్కడ వుండి Departmental Heads వారి చిత్తంవచ్చినట్లు ఖర్చు చేసే అవకాశం వారికి ఉంది. అంటే యివన్నీ యిప్పుడు మనం pass చేసిన తరువాత మంత్రివర్గం మీద చాలా బాధ్యత పెడుతున్నామన్నమాట. అయితే దాంట్లో ప్రధానంగా యిప్పటివరకూ జరుగుతున్న లోపాలు అనేకం సభ్యులు అనేక విధాలుగా తెలియజేశారు. అందులో ముఖ్యమైనది ఈ సంవత్సరంలో. అంటే మనం మళ్ళీ బడ్జటు ప్రవేశపెట్టే లోపున, అప్పుడు ఆర్థిక మంత్రిగా ఎవరున్నా సరే, ముఖ్యమంత్రిగా ఎవరున్నాసరే, వారు రాష్ట్రంలోని పనులన్నీ సర్దుబాటు చేశామని సగర్వంగా చెప్పగలరని నేను ఆశిస్తున్నాను. అందుకుగాను ఇప్పటినుంచే మనం ప్రయత్నం చేయవలసియున్నదని మరొకసారి విజ్ఞప్తి చేస్తున్నాను.

ముఖ్యంగా యిప్పటి మన ఖర్చులలో చాలావరకు దుబారా జరుగుతున్నదని, ప్రతివారు అనేక సందర్భాలలో చెప్పారు. దాన్నిబట్టి ఏ మంత్రిగారైన సరే యిప్పుడు వున్న చిన్నచిన్న ప్రభుత్వోద్యోగస్థులను తగ్గించాలనే అభిప్రాయం వ్యక్తపరచారంటే, అది చాలా పొరబాటు అభిప్రాయమని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

ముఖ్యమంత్రిగారు దీనిపైన మాట్లాడుతూ చిన్న ఉద్యోగస్థులను తగ్గించమని హామీ ఇచ్చారు. ఆ హామీని దృష్టిలో పెట్టుకోమని కోరుచున్నాను. ఇంకా కొన్ని శాఖలలో ఉన్నవారిని తగ్గించవలసిన అవసరమున్నది. ముఖ్యంగా పి. డబ్ల్యు. డి., ఎలెక్ట్రిసిటీ, ఇంజినీరింగు శాఖలలో దుబారా ఉన్నది. ఆ విషయాన్ని అనేక తడవలు మంత్రివర్గం దృష్టికి తీసికొని వచ్చినాము. దీనిని నిర్మూలించలేక పోయినట్లయితే ఎన్ని కోట్ల రూపాయలు అదనముగా పన్నులు వేసినా మన పరిపాలనా పద్ధతి ఇదేవిధముగా ఉంటుంది. ఈ సందర్భములో ఇంకో విషయంకూడా చెప్పవలసిన అవసరం ఉన్నది. పూర్వపు అధికార వర్గము మనకు పూర్తిగా సోషలిస్టిక్ పాట్రన్ ఆఫ్ సొసైటీని అంగీకరించినా, అంగీకరించకపోయినా బ్రిటిషు సామ్రాజ్యవాదులు మనదేశము వదలిపోయిన తరువాత కొన్ని ప్రధానమయిన మార్పులు మనయొక్క ఆశయములలో

వచ్చాయి. ప్లానింగుద్వారా గ్రామాలలోని ప్రజలయొక్క అభివృద్ధికి తోడ్పడవలెననే ఆశయమును శ్రీ సంజీవరెడ్డిగారి మాటలలో చెప్పాలంటే - కలంద్వారా అయినా వ్యక్తంచేస్తున్నారు. అయితే దాని కనుగుణమైనటువంటి ఎడ్మినిస్ట్రేటివ్ సెట్టప్‌ను తదనుగుణ్యంగా మార్చాలి. పాత పద్ధతులద్వారా మనము మన ప్లానును జయప్రదం చేసుకోలేము. మన కార్యక్రమములను సక్రమంగా నిర్వహించుకోవాలంటే యీ ఎడ్మినిస్ట్రేటివ్ సెట్టప్స్ తప్పకుండా మార్చవలెనని మంత్రివర్గంయొక్క దృష్టికి తెస్తున్నాను. ఈ చర్చలలో పరిశ్రమలను ఇంకా ఎక్కువ అభివృద్ధిలోకి తీసుకొని రావలెనని చాలామంది చెప్పారు. ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో పరిశ్రమలు-ఆంధ్రప్రాంతంలో కంటే ఎక్కువ ఉన్నాయి. పరిశ్రమలను ఎక్కువగా పెట్టడానికి ఇక్కడ ప్రయత్నంచేశారు. పెట్టారుకూడా. కాని అవి సక్రమంగా నిర్వహింపబడలేదు. వాటిని సరిగా నిర్వహించవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది. సంజీవరెడ్డిగారు అందరినీ సలహాలు ఇవ్వమంటున్నారు. అయితే సలహాలు అడగకపూర్వమే కొన్ని నిర్ణయాలకువచ్చి అమలుజరుపుతూ, తరవాత సలహాలను అడగడం జరుగుతున్నది. కాని ప్రధానముగా ఉన్న కొన్ని పరిశ్రమలలో యీనాడు కేంద్రప్రభుత్వం కొన్ని షరతులు పెడుతున్నారు. మేనేజింగు ఏజన్సీస్‌ను కేంద్రప్రభుత్వమునకు యీయాలని చెప్పారు. సోషలిస్టుపార్టీ నాయకులయిన రత్నసభాపతిగారు అలాగ ఇవ్వకూడదనీ, మనమే యీ మేనేజింగు ఏజెన్సీస్‌ను నడిపినట్లయితే అదనంగా మనకు డబ్బురావడానికి వీలుంటుందని చెప్పారు. దానితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కేంద్రప్రభుత్వమునకు ఇచ్చినట్లయితే దానిమీద వచ్చే డబ్బు మొత్తంకూడా కేంద్రప్రభుత్వానికి పోతుంది. కేంద్ర ఉద్యోగస్థులు ఉండకూడదని కాదిది. వాళ్ళ ఎక్స్‌పర్ట్సు ఉండి మన ప్రభుత్వ యాజమాన్యంక్రింద ఎందువల్ల పనిచేయకూడదో నాకు అర్థం కావడంలేదు. అందువల్ల దీని విషయంలో తిరిగి ఆలోచించవలసిన అవసరం ఉన్నదని తెలియ చేస్తున్నాను.

ప్రభుత్వం ఏదైనా సలహాలు కావాలని కోరేటట్లయితే నిర్ణయాలకు రాకపూర్వమే సలహాలు అడగవచ్చు. నిర్ణయాలకు రాకపూర్వం సలహాలు యిస్తే వీలైతే వారు పాటిస్తారని తృప్తి ఉంటుంది. "ప్రభుత్వం నిర్ణయానికి రాకపూర్వం సలహాలు అడిగినది, ఫలానా సలహాలు ఇచ్చారు. వాటిలోనుంచి మంచి చెడ్డలను ఆలోచించి అంగీకరిస్తారు. లేకపోతే తిరస్కరిస్తారు" అనే తృప్తి ఉంటుంది. కాని అలా కాకుండా నిర్ణయాలకు వచ్చినతర్వాత సలహాలు అడగడంవల్ల నిర్ణయాలను మార్చడానికి ప్రభుత్వానికి అవకాశములు లేకపోవడము జరుగుతున్నది.

ఇక్కడ ఉన్న రోడ్ ట్రాన్సుపోర్టు విధానాన్ని తప్పకుండా ఆంధ్ర ప్రాంతానికి కూడా ఎక్స్టెన్డుచేయవలసిన అవసరం ఉన్నది. ఐతే ఏ పరిస్థితులలో కూడా అక్కడ ఉండే ఎగ్జిస్టింగు మైలేజీ రేట్సును మాత్రం ఎప్పుడూకూడా పెంచకుండా చూస్తామని హామీ ఇవ్వాలని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పుడున్నటువంటి రేట్లు పెంచినట్లయితే ప్రజలు ప్రయాణం చేసేటటువంటి స్థితిలో లేకుండాపోతారు అనేదిమాత్రం దృష్టిలోనికి తీసుకోవాలి అని కోరుతున్నాను.

నేను ఇదివరలో మాట్లాడుతున్నపుడు రిటైర్డు ఆఫీసర్సు విషయంకూడా కొంత చెప్పాను. నా ఉద్దేశ్యంలో వారి శక్తి సామర్థ్యాలను శంకించాలని ఎక్కడాకూడా లేదు. ముఖ్యమంత్రిగారు సమాధానం చెబుతూ ఏదో వారందరికి శక్తి సామర్థ్యాలు లేనటువంటివారని, బాగా పరుగెత్తలేనటువంటివారని, ఏదో వారు బాగా నడువలేనటువంటివారని, బాగా మోటారుకారు డ్రైవ్ చేయలేనివారని నేను అన్నట్లు చెప్పారు. అది ఎంతమాత్రం కాదు. వారి శక్తి సామర్థ్యాలను శంకించే విషయం లేనేలేదు. శ్రీ సోమయాజులుగారు ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు చీఫ్ ఇంజనీరుగా ఉన్నవారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడేటప్పుడు వారు చేసిన సేవ, వారు చేసిన పనులు మాకు కూడా తెలుసు. దానికి తప్పకుండా అభినందించాలి. అంతేకాకుండా శ్రీ వెంకటకృష్ణయ్యర్ గారు కూడా పెద్ద చీఫ్ ఇజనీర్సులో ఒకరు. అలాంటివారికి కొంత విశ్రాంతి యీయవలసిన అవసరం ఉన్నదేమో. వారి సలహాలు పొందవచ్చును. ఒక ఎడ్వయిజరీ కమిటీని వేయండి. వారి సలహాలు తప్పకుండా తీసుకోండి. కాని వారిని ఇప్పుడు ఉండే పోస్టుసులోనే అట్లనే కంటిన్యూ చేయవలసిన అవసరం ఉన్నదా అనేది ఆలోచించాలి. నేను ఇంకో అడుగు ముందుకుకూడా పోతాను. కె. సి. కెనాల్ ఉన్నది. శ్రీ వెంకటకృష్ణయ్యర్ గారిని గుర్తించాలంటున్నారు. నాకూ ఉన్నది గుర్తించాలనే. వారిస్టాట్యూ ల్యాంటిది కె.సి. కెనాల్ దగ్గర తప్పకుండా ఒకటి ఏర్పాటు చేయండి. ఆ కె. సి. కెనాల్ యొక్క మరమ్మతులకు చిహ్నంగా, ప్రతిబింబంగా వారి స్టాట్యూ తప్పకుండా అక్కడ ఉండవలసిన అవసరం ఉన్నదని నేను ముఖ్యమంత్రిగారికి తెలియచేస్తున్నాను.

అంతేకాని రిటైర్డు ఆఫీసర్సును ఒక పాలిసీగా ఎక్స్టెన్డు చేయడం మంచిది కాదని నేను తెలియచేస్తున్నాను. కేవలం వారి విషయంలోనే కాదు. కొంత మంది సూపరిన్టెండింగు ఇంజనీర్సును కూడా ఎక్స్టెన్డు చేశారనే విషయం నా దృష్టికి వచ్చింది. ఈ పద్ధతి ప్రకారం పోయినట్లయితే అనేకమంది ఆఫీసర్లు.....

**శ్రీ యన్. సంజీవరెడ్డి:** ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లుగా ఇన్ని ఏళ్లు ఉంటే ప్రమోషన్లు చేయాలని ఉంటుంది. అన్ని ఏళ్లుఉన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు

కానట్లయితే - ఆంధ్ర దేశంలో జరిగిన సంగతి చెబుతున్నాను. ఇక్కడ జరిగిన సంగతి నాకు తెలియదు. 5 సంవత్సరములైనా ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లుగా ఉంటే సూపరిన్‌టెండెంటు ఇంజనీరుగా ప్రమోట్ చేస్తే తగిన అనుభవం ఉంటుంది. అది ఉపయోగపడుతుంది అనుకుంటాను. 5 ఏళ్లయినా ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్లుగా ఉన్నవారు లేకపోయినట్లయితే ఇక రిటైరు అయ్యేవారికి ఒక ఏడో, 3 ఏళ్లో ఎక్స్టెన్షను చేయవలసి ఉంటుంది. అది కన్వీనియన్సు కోసం చేస్తున్నదే తప్ప ఇంకొకటికాదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : ఒక జనరలు పాలసీగా ఉండకూడదని మంత్రివర్గం యొక్క దృష్టికి తీసుకొనివచ్చారు.

ప్రభుత్వ ఉద్యోగస్థుల జీతాలు, విలేజి ఆఫీసర్సు జీతాలు, ఉపాధ్యాయుల యొక్క జీతాలు గురించి చెప్పవలసి ఉంది. టీచర్సు యొక్క జీతాల విషయంలో చెబితే పట్టాభి రామారావుగారు ఏదో అరాచక శక్తుల యొక్క ప్రోత్సాహంవల్ల ఇలా జరుగుతున్నదని చెప్పారు. విలేజి ఆఫీసర్సు యొక్క జీతాల విషయంలో కళా వెంకట్రావుగారు కూడా అరాచకశక్తుల ప్రోత్సాహం వల్లనే జరిగిన దంటున్నారు. ప్రభుత్వ ఉద్యోగస్థుల సంగతి చెప్పినప్పుడు సంజీవరెడ్డిగారు, గోపాలరెడ్డిగారు అలా మాత్రం చెప్పలేదు. సంతోషం. ఎవరు అరాచక శక్తులకు ప్రోత్సాహమీయగలరో శ్రీ కళా వెంకటరావు గారికి బాగా తెలుసు. మనందరి యొక్క బంధు కోటిలోంచి వచ్చినవాళ్లే కనుక ముఖ్యంగా చెప్పనవసరంలేదు. ప్రభుత్వ ఉద్యోగస్థులకు కొంతమందికి రు. 6 పెంచిన తరువాత మిగిలిన సెక్షను పెంచకపోతే వాళ్లలో అసంతృప్తి కలిగినా దానిని తొలగించక పోవడం మూలంగా వచ్చిన ఆందోళనను ఎవరో అరాచక శక్తులు ప్రోత్సహించారని చెప్పడం సమంజసంకాదు. ముఖ్యంగా భూస్వామ్య శక్తుల నుంచే యీ మాటలు వినిపిస్తున్నాయి. కాని మరెవ్వరినుంచి వినిపించ లేదు. ఈ రోజున మారిన పరిస్థితులను యీ భూస్వామ్య శక్తులు దృష్టిలో పెట్టుకోవలెనని వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. నేను చెప్పేది ఒకటే. ఇంకో కోటి రూపాయలు డెఫిసిట్ రానివ్వండి. బెంగాల్‌లో డెఫిసిట్ ఉన్నది. యు. పి. లో ఇంకా ఎక్కువ డెఫిసిట్ చేసుకోడానికి తయారవుతున్నారు. ముఖ్యంగా కేంద్ర ప్రభుత్వంయొక్క ఉద్యోగుల జీతాలు ఇంకా పెంచాలని వారు కోరుతున్నప్పుడు మన ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు కనీసం వారి ప్రక్కన పనిచేస్తున్న గుమాస్తాల జీతాలవలె ఇవ్వండి అని అంటే, అది సక్రమమైన కోరిక కాదనీ, ఎవరో అరాచక శక్తులు ప్రోత్సాహ పరుస్తున్నారని చెబితే ఎవరిని సంతృప్తి పరుస్తారు. కాంగ్రెసు పార్టీలో ఒక రిద్దరు సభ్యులు అనవసరంగా యీ విధంగా చెప్పి ఎవరో కమ్యూనిస్టుసోదరులు రెచ్చగొడుతున్నారని

అనవసర పద ప్రయోగాలకు దిగజారితే దిగజారవచ్చును. కాని అసలు విష యాన్ని మరచిపోవద్దని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అందువల్ల తప్పనిసరిగా యీ ప్రభుత్వ ఉద్యోగులకు, గ్రామోద్యోగస్థులకు న్యాయం చేకూర్చాలి. గ్రామోద్యోగస్థులను రీప్లేస్ చేయడం చాలా కష్టమని ఇందాక ఎవరో చెప్పారు. కష్టమని కాకపోయినా ఇతర ఉద్యోగులకిచ్చిన కరువుభత్యం వారికికూడా యీయాలని నేను కోరుచున్నాను.

రైల్వేస్ విషయం కేంద్ర ప్రభుత్వంవారిది అయినప్పటికిని ఒక సంగతి చెబుతాను. ఈ విషయంలో మన బాధ్యతకూడా ఉన్నది. ఇప్పటివరకు 7 జోన్లు ఉంటే, 8వ జోన్‌ను అస్సాం ప్రాంతానికి పెట్టారు. ఆంధ్రదేశం ఏమి గొడ్డు పోయిందని. జోన్ ఏర్పాటు చేయలేదు. ఆంధ్ర దేశానికి ప్రత్యేకంగా జోన్ కావాలి ? కావాలిఅని అన్ని పార్టీలవారు, ప్రజానీకం కోరుతూంటేకూడా ప్రత్యేకంగా ఇంతవరకు రైల్వే జోన్ ఏర్పాటుచేయలేదు. కేంద్రప్రభుత్వ దృష్టి ఏ యాస్పెక్టులోచూచి నప్పటికీకూడా ఆంధ్రదేశం, ఆంధ్రప్రభుత్వం, ఆంధ్ర ప్రజలుఅంటే పూర్తిగా వ్యతిరేకత తప్ప ఇంకొకటి కనపడడం లేదు.

రైల్వే జోన్ వేరే ఏర్పాటు చేయండి, మా ఆంధ్రులకు రైల్వేస్‌లో ఉద్యోగాలు తక్కువ వస్తున్నాయి అని మొత్తుకుంటుంటే మన మొర ఆల కించేవాళ్లు లేకుండా పోతున్నారంటే దానికి కారణం ఏమో ప్రతివాళ్ళు కూడా ఆలోచించుకోవలసి ఉంది. అంతేకాదు. యీరోజున అనేకరైళ్లు ఆంధ్ర దేశంలోనుంచి పోయినా ఆంధ్రదేశంలో ఆగకుండా పోయేటటువంటివి ఉన్నా యంటే ఎందువల్లనో గుర్తించాలి. మనము ప్రత్యేకంగా రైలు వేయమంటే మద్రాసునుంచి రెండు క్యారేజెస్ కలుపుతా మన్నారట, మద్రాస్‌నుంచి ఢిల్లీ వెళ్లేవారిని సుఖముగా పొమ్మని. ఈ పరిస్థితులను మనము కేంద్ర ప్రభుత్వ దృష్టికి తేవాలి. అందువల్ల ఆంధ్రప్రదేశానికి హైదరాబాదును హెడ్ క్వార్టర్సుగా పెట్టి ఒక ప్రత్యేకమైన జోన్‌ను ఏర్పాటు చేయాలని మన ఆంధ్ర మంత్రివర్గం తప్పకుండా కేంద్ర ప్రభుత్వానికి సూచన చేస్తుందని నేను ఆశిస్తున్నాను.

**శ్రీ జి. నరసింహామూర్తి (అమలాపురం - జనరల్) :** అధ్యక్షా ! ఇప్పుడు మన ఆంధ్రప్రదేశమంతటలోకూడా అభివృద్ధిచెందిన ప్రాంతమని కొంత ప్రాంతానికి, వెనుకబడిన ప్రాంతమని రాయలసీమ ప్రాంతాన్ని, తెంగాణా ప్రాంతాన్నీ మనము భావనచేస్తున్నాము. అందులో చాలావరకు నిజముఉన్నది, లేకపోలేదు. ఉత్తరమున శ్రీకాకుళం జిల్లా లగాయితు దక్షిణమున నెల్లూరుజిల్లా ఉత్తరసరిహద్దువరకు బంగాళా ఖాతమును అనుకొని ఉన్నటువంటి కోస్తాలోని జిల్లాలుతాలూకాలను చాలా అభివృద్ధిచెందిన ప్రాంతాలుగా భావించు కొంటున్నాము నిజమే.

ఈ రాష్ట్ర ప్రజల అవసరానికి సరిపోయేటటువంటి ఆహార ధాన్యాలే కాకుండగా ఇతర రాష్ట్రాలకు కూడా పంపించే స్తోమత ఈ రాష్ట్ర ప్రభుత్వానికి కలిగించేటటువంటి ఆహారోత్పత్తి ఆ తాలూకాలో ఇప్పుడు ఉన్నటువంటి మాట నిజమే. అయితే ఆ ప్రాంతంలో ఉన్నటువంటి లోపాలు, ఇబ్బందులు తద్వారా ప్రభుత్వ ఆదాయానికి కలుగుతున్నటువంటి ఈ నష్టాన్ని కూడా ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని, ఆ ప్రాంతాన్ని ముఖ్యంగా రవాణా సౌకర్యములలోను, మురుగునీటి సౌకర్యములలోను (drainage), వెనుకబడిన ప్రాంతముగా భావించి ఆ తూర్పుకోస్తాలో ఉన్నటువంటి పల్లపు తాలూకాల విషయంలో ఎక్కువ శ్రద్ధవహించి హెచ్చు మొత్తము అచ్చట రెండు సౌకర్యములకొరకు అనగా రవాణా సౌకర్యమునకు, drainage సౌకర్యమునకు, ఖర్చుపెట్టకలిగినట్లయితే ఇప్పుడు ప్రభుత్వానికి వస్తున్నటువంటి ఆహారధాన్యాలు అయితేనేమి, పన్నుల రీత్యా వచ్చేసొమ్ము అయతేనేమి, ఇంతకంటె రెట్టింపు ప్రభుత్వానికి వస్తుందని మనవిచేస్తున్నాను. అప్పుడు ఆ ఆదాయముతోనే మిగతా వెనుకబడిన ప్రాంతాలను అతి సులువుగా అభివృద్ధిపరచడానికి అవకాశం ఉంటుంది.

తరువాత, చిన్న ఉద్యోగస్తుల విషయము ఉన్నది. ప్రభుత్వము పటిష్టంగాను, ప్రజారంజకంగాను పరిపాలన సాగిస్తున్నదని అనిపించుకోవలసివస్తే, ప్రభుత్వములో పనిచేస్తున్నటువంటి Gazetted ఉద్యోగస్తులు, పెద్ద ఉద్యోగస్తులు కానివ్వండి, చిన్న ఉద్యోగస్తులు కానివ్వండి, అందరికి కూడా ప్రభుత్వంమీద ఒక విధమైనటువంటి భక్తి, ఇది నా దేశము అనేటటువంటి దేశభక్తి, ఈ రెండు ఉన్నప్పుడే ప్రభుత్వము సంకల్పించినటువంటి ఏ పథకాలున్నప్పటికినీ అవి ఎంత కష్టసాధ్యమైనప్పటికీకూడా, వాటిని జయప్రదంగా నిర్వహించుకొనిపోతూ రాష్ట్రాన్ని పురోగమింపచేయ గలుగుతుంది. ఆ గుణములు ప్రభుత్వోద్యోగులలో కొరతబడినట్లయితే, దానికి భిన్నమైనటువంటి పర్యవసానం కలగడం సహజం. ఉదాహరణకు గ్రామోద్యోగస్తుల సమస్య తీసుకోండి. వీరి సమస్య గురించి ప్రధానంగా అందరూకూడా చర్చిస్తున్నారు. వారి కోర్కెలు అసహజమైనవి కావు, చాలావరకు మనము ఆమోదించగలిగినటువంటివే. కాని Revenue మంత్రిగారు ప్రకటించినటువంటి ప్రకటనలవల్ల నైతేనేమి, లోగడ ముఖ్యమంత్రిగారు చేసిన - ప్రకటనవల్ల నైతేనేమి ఆ గ్రామోద్యోగస్తులు అవలంబిస్తున్న విధానంలో కొంత లోపము కన్పిస్తుందని చెప్పడంతప్ప, వారికి ప్రభుత్వము తలపెట్టినటువంటి ప్రమాదకరమైన నష్టమేమీ నా కంటికి కనుపించడంలేదు. ఇప్పుడేమీ మించి పోలేదు. ఇప్పుడు వారి విషయంగురించి ఒక కమిటీని వేసినామని అంటున్నారు. ఆ కమిటీ నిర్ణయం 6, 7 మాసములలో రానైయున్నది. ఈలోపల నేను ఒక సూచన చేస్తున్నాను. కమిటీనిర్ణయాలను చర్చించేముందో లేక తరువాతనో. గ్రామోద్యోగస్తులకు సంబంధించినంతవరకు

ప్రభుత్వము ఈ సూచనను కొంచెము యోచించవలసిందని తమద్వారా నేను విజ్ఞప్తి చేస్తున్నాను. గ్రామోద్యోగుల కృషివల్లనే ప్రభుత్వముయొక్క ఆదాయము హెచ్చో, తరుగో ఆధారపడియున్నది. ఈనాడు రాష్ట్రములో నాలుగు కోట్ల రూపాయలు అప్పులనుంచిన్నీ, దరిదాపు కోటిరూపాయలు Excise నుంచిన్నీ నష్టము వస్తున్నట్లు నిన్ననే మంత్రిగారు సెలవిచ్చారు. అటువంటప్పుడు, మన రాష్ట్రప్రభుత్వానికి ఆర్థికలోపము వచ్చినట్లైతే ప్రభుత్వములో ఉన్నటువంటి అన్నివర్గాలవారికి ఇబ్బందులు వస్తాయి అనే భావనకలిగి ఈ అయిదుకోట్ల రూపాయలుకూడా వసూలు చేయాలనేటటువంటి దీక్ష కలిగి ఉన్నట్లయితే, ఈ రోజు ప్రభుత్వానికి ఇంతలోటు వచ్చిఉండేదికాదు. ఎందుచేతనో వారికి ఒకవిధమైన అలసత్వం వచ్చింది. ఇప్పుడు బకాయిలు హెచ్చు భాగము వసూలు కాకుండా ఉండిపోవడానికి నూటికి 70 వంతులు కారణం గ్రామోద్యోగులే నని నేను అనుకొంటున్నాను. ముఖ్యంగా రాష్ట్రపరిపాలనను సాగిస్తున్నటువంటి ప్రభుత్వ అధినేతలందరు మహాత్మాగాంధి అనుచరులు. ఈనాడు పండిట్ నెహ్రూ నాయకత్వాన్ని మనసార త్రికరణశుద్ధిగా ఆరాధిస్తున్నారని మనవిచేస్తున్నాను. ఈనాడు పండిట్ నెహ్రూ ప్రపంచానికంతటికి సమస్యలను సామరస్య పూర్వకమైనటువంటి స్నేహవాతావరణంలో చర్చించుకోవడంద్వారా పరిష్కరించుకోవలెనని ప్రపంచానికంతటికి యెలుగెత్తి చాటుతుంటే ఈ రోజు వారి నాయకత్వాన్ని ఆరాధిస్తున్న మన ప్రభుత్వ అధినేతలు కూడా అదేవిధానాన్ని తమ రాష్ట్రములలో ఉన్నటువంటి ప్రజల పట్ల ప్రయోగించి దానివల్ల సత్ఫలితాలను పొందవలసి యుంటుంది అనేది వారికి తెలియనటువంటిది కాదు. అయినప్పటికీ ఈ విషయం ఒక్కసారి వారికి జ్ఞప్తికి తీసుకురావలెనని అభిప్రాయ పడుతున్నాను. ఈ సమస్యను కొంత సామరస్య పూర్వకంగా పరిష్కరించి ఉద్యోగులలో విశ్వాసాన్ని పెంపొందించి వారికి దేశభక్తి కలిగేటట్లు చేసి రాష్ట్ర పురోభివృద్ధికి తోడ్పడవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను. ముఖ్యంగా గ్రామోద్యోగస్తులకు సంబంధించినంతవరకు నేను ఒక సూచనచేస్తున్నాను. భారతములో "ఏకక్రియాద్వ్యర్థిక బభూవ" అని చెప్పబడింది. అంటే ఒకేపనివల్ల రెండుప్రయోజనాలను పొందవలెననిచెప్పారు. ఇప్పుడు గ్రామ ఉద్యోగుల విషయంలో, ఎవరిమీదో పన్నులువేసి ప్రజలను బాధపెట్టి వీరిజీతాలు హెచ్చుచేసే స్థితిలో లేమని అన్నారు. అది సమంజసమైన విషయమే. కాని ప్రజలకు పన్నులు వేయనక్కరలేదు. వారికి జీతాలు ఎక్కువ ఇవ్వ నవసరం లేదు. గ్రామోద్యోగులు వసూలు చేసే మొత్తములో, ఇంత percentage వారికి ఇస్తామనేటటువంటి నిర్ణయం ప్రభుత్వము తీసుకొన్నట్లయితే ప్రభుత్వానికి పన్ను చక్కగా వసూలు అయిపోతుంది. గ్రామోద్యోగులు కూడా సంతుష్టి కలిగి దేశభక్తి కలిగి, ప్రభుత్వముయందు అత్యంత ఆదరాభిమానాలతో ప్రభుత్వము

సాగించేటటువంటి ఈ అభివృద్ధి కార్యక్రమాలలో సహకరిస్తారు. ఇదేవిధంగా మిగతా ఉద్యోగుల విషయంలో కూడా శాంతియుతంగా వారి సమస్యలను పరిష్కరించ వలసిందని కోరుతూ అధ్యక్షులవారు ఈ అవకాశమిచ్చి నందులకు వారికి నా కృతజ్ఞతాభివందనములు తెలుపుచూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ పి. గున్నయ్య : అధ్యక్షా, ఈ డిమాండును నేను హృదయ పూర్వకంగా బలపరుస్తూ ప్రభుత్వానికి తమ ద్వారా కొన్ని సూచనలు మనవి చేస్తున్నాను. కాంగ్రెసు ప్రభుత్వము వచ్చిన పదేళ్లనుండి, దిగువ ఉన్నటువంటి పేద ప్రజలు మొదలుకొని లక్షాధికారులు, కోటీశ్వరుల వరకు కూడా అందరికిని ఎవరికి కావలసిన సహాయము వారికి ఈ ప్రభుత్వము చేసిందని నేను గర్విస్తున్నాను. అయినా ప్రభుత్వము ప్రజల సౌకర్యము కొరకు కోట్లకొలది ఖర్చు పెడుతున్నారని పేపర్లలో చూచి, ఇంకా అనేకమైనటువంటి సినిమాలలో కూడా జూచి పల్లె ప్రాంతాలలో ఉన్నటువంటి ప్రజలు ఎంతో ఆశతో ఉన్నారు. కాని ఈ బడ్జెటు చూచినట్లయితే గ్రామాలలో ఉన్న ప్రజలకు కాస్తా నిరుత్సాహము వస్తుందేమోనని నేను భయపడుతున్నాను. అందుచేత మన సోదర సభ్యులందరు opposition పార్టీవాళ్లు ఎవరి పార్టీ తరపున వాళ్లు చెప్పకొన్నారు. కనుక నా పార్టీ తరపున కూడా నేను కొన్ని విషయాలు మనవి చేస్తున్నాను. ప్రతి సంవత్సరము, 3 మాసాల కొకమారి, 4 మాసాల కొకమారి వోట్లు పుచ్చుకొన్నటువంటి వాళ్లు ప్రజలముందుకు వెళ్ళవలసి యుంటుంది. పదియేళ్ల నుంచి ప్రభుత్వము కోట్లకొలది డబ్బు ఖర్చుపెడుతున్నప్పటికీ, గ్రామాలలో ఏమీ ఖర్చు పెట్టడంలేదు. ఉదాహరణకు మా జిల్లాలోనే గోపాలరెడ్డిగారి ప్రభుత్వంలో 2½ కోట్ల వరకు రైతులమీద పన్నులువేసినారు. ఐనా ఇస్తామని గ్రామస్థులు, సామాన్యరైతులు చెప్పుతున్నారు. ఒకగ్రామంలో ఐదువేల రూపాయలు శిస్తు తీసుకొంటే కనీసం ఆ గ్రామంలో రెండు వందల రూపాయలు కూడా ఖర్చు పెట్టలేదు అని చెబుతున్నారు. మేము ఆ గ్రామంలో తిరుగుతూ ఉంటే, 'ఇదేమిటయ్యా ?' అని మమ్ములను గట్టిగా అడుగుతున్నారు. గ్రామాలలో చెరువులు మరమ్మతులు చేయ్యకపోవడమే కాదు, ఇంత బ్రహ్మాండమైనటువంటి రెండవ పంచవర్ష ప్రణాళికలో ఒక సిమెంటు బస్తాకూడా గ్రామాలకు వెళ్లడంలేదు. పట్టణాలలో బ్రహ్మాండమైన సినిమాశాలలకు ప్రభుత్వంవారు సహాయం చేస్తున్నారు కాబట్టి, అవి వేసేస్తున్నారు. ఆ సినిమాలు చూడడానికి పల్లెటూళ్ల ప్రజలు పట్టణాలకు వచ్చి, ఆ పట్టణాలలో ఉండే పెద్ద పెద్ద భవనాలు పెద్ద పెద్ద సిమెంటుమేడలు, చూచి ఆశ్చర్యపోతున్నారు. ఆ విధంగా పట్టణాలుంటే, గ్రామాలలో ఒక సిమెంటు బస్తా కూడ దొరకడంలేదు. ఒక పేదరైతు తాశిల్దారు దగ్గరకో, P. W. D. Supervisor దగ్గరకో

వెళ్ళితే మా దగ్గర సిమెంటు లేదంటున్నారు. పన్రెండు రూపాయల లెక్కన **P. W. D. Supervisor** ల దగ్గర, తాశీల్దార్లదగ్గర కొనుక్కొంటున్నారు. అంటే ఇది మా పార్టీకే విచారకరమైనటువంటిది. చిన్న ఉద్యోగస్తులు మొదలుకొని మూడువేల రూపాయలు జీతము తీసుకొనే ఉద్యోగస్తులవరకు అందరికి కూడ పల్లెప్రజానీకం తమ సర్వశక్తిని ఉపయోగించి, భూమిని ఉపయోగించి ఆహారాన్ని supply చేస్తున్నారు. అలాంటి పల్లెప్రాంతాలలోను ఈ ప్రభుత్వము కన్నెత్తి చూచి వాళ్ళకు కావలసిన సౌకర్యములు కలుగజేసి మళ్ళీ ప్రజల ముందుకు మా పార్టీవారు వెళ్ళేటట్లు చేయాలని మనవి చేస్తున్నాను.

జిల్లాబోర్డు ఎలెక్షన్లు రాబోతున్నాయి. ఎవరిపార్టీతరఫున వారు వెళ్ళి ప్రచారం చేస్తారు? ఈ అపోజిషన్ పార్టీవారు, యిక్కడ చెప్పినవారు అంతా అక్కడ చెపుతారు. కాబట్టి ఈ నాలుగునూసాలలోనైనా ప్రభుత్వం పల్లెప్రాంతాలవైపు కన్నుఎత్తిచూచి, మైనర్ ఇరిగేషన్ పనులు, రోడ్ల పనులు తొందరలో చేయించాలని మనవిచేస్తున్నాను. హరిజనులకు కేటాయించిన డబ్బు చాలా తక్కువ వున్నది. కొన్నివందల రూపాయలు గోపాలరెడ్డిగారు ఖర్చుపెడుతున్నారు. ఒక కోటి రూపాయలు నివేశన స్థలాలకు రిజర్వు ఫండుగా వుంచి తొందరలో ఈ సంవత్సరం లోపల, లేక రెండు సంవత్సరములలోపల హరిజనులకు స్థలాలు యిచ్చుటకు ప్రయత్నించాలని ప్రభుత్వాన్ని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. మనము యిప్పుడు **N. G. O.** ల అల్లరి, టీచర్ల అల్లరి, గ్రామాలలో మునసబు, కరణాల అల్లరి చూస్తున్నాము, వాళ్ళు ఎప్పుడైనా మనను గట్టిగా ఒక పట్టుపడతారని నా ఉద్దేశం. వారికి చాలా కష్టాలున్నాయి. ఎస్టేటులో యిదివరకు ఒక్క క్విట్ రెంట్ వసూలుచేసేవారు. ఇప్పుడు అనేక కష్టాలు ఉన్నవి. అలాగే టీచర్లు పిల్లలను కాచుకొనుటకు కష్టాలు వున్నవి. **N. G. O.** ల్లో ఆంధ్ర, తెలంగాణా అనే వ్యత్యాసము లేకుండా చేయండి. ఆంధ్రనుంచివచ్చిన **N. G. O.** లు వ్రాతలో, చదువులో అన్నివిధాలా సమర్థులు వున్నారు. తెలంగాణా అయితే కొన్ని ప్రాజెక్టులు కట్టించండి, రోడ్లు వేయండి, బస్సులు యివ్వండి, ఉద్యోగం విషయంలో అందరూకష్టపడుతున్నారు. కాబట్టి తెలంగాణా, ఆంధ్ర అనే భేదం లేకుండా **N. G. O.** లకు ప్రభుత్వం తప్పకుండా సహాయంచేసి మా పార్టీని బలపరుస్తారని వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. గ్రామ ఉద్యోగులకు సౌకర్యులతోపాటు, రు. 30 లు జీతముచేయాలి. వాళ్ళు, గ్రామ జమీందారులులా ఎప్పటిమంచో వున్నారు. వారి విషయం చక్కగా ఆలోచించి, తప్పకుండా ప్రభుత్వం సహాయంచేసి మా పార్టీని బ్రహ్మాండమైన పార్టీగా చేయించాలని ముఖ్యమంత్రిగారిని వినయపూర్వకంగా తమద్వారా ప్రార్థిస్తూ, తమరు నాకు యీ అవకాశం యిచ్చినందుకు హృదయపూర్వకమైన వందనములు సమర్పిస్తూ విరమిస్తున్నాను.

శ్రీ పి. సుందరయ్య : అధ్యక్షా ! గత 20 రోజులుగా బడ్జెటు చర్చలు జరుగుతున్నాయి. వివిధ డిపార్టుమెంటులలో, వివిధ రంగాలలో ప్రభుత్వ విధానాలను, మంత్రులు బడ్జెటు సందర్భములో వివరించుట జరిగింది. కొంత మంది మంత్రులు కటువుగా, కోపమువచ్చి బెదరించురీతిగా మాట్లాడారు. మరి కొంతమంది, మాటలలో మర్యాదగా, ఎంతో ఆలోచిస్తామని చెప్పి, ఆచరణలో ఏమిచేయలేము, చేయము; అనేరీతిగా చెప్పుట జరిగింది.

ఆ పరిస్థితులలో ఈ **Appropriation Bill** మంజూరు చేయుటకు మేము పూర్తిగా వ్యతిరేకంగా వున్నాము. ప్రభుత్వ విధానాలు ఏమిటని చూచినప్పుడు, వ్యవసాయ ప్రజానీకాన్ని తీసుకుంటే బీదప్రజలను బంజరు భూముల నుంచి, లంకభూములనుంచి, కౌలు భూములనుంచి, తొలగిస్తున్నారు. అవి రాజకీయ బాధితులకు యిస్తున్నారు. వీరిని ఇదివరకు రాజకీయ బాధితులని అన్నారు. ఈ మధ్య 'జాతీయ వీరులు' అని కొత్త పదము వాడుతున్నారు. నిజమే, దేశ పోరాటములో జాతీయ వీరులు కావచ్చును, సర్వస్వము పోగొట్టుకొని ఈ రోజున బాధపడుతున్న వారికి భూములు యిస్తామని మొదలుపెట్టి, చివరకు ఆ ఉద్యమములో శిక్షపడినా, జుల్మానా పడినా, భూములు ఉన్నా భూములు యిస్తామని 10, 15 సంవత్సరముల నుంచి బీద ప్రజలు సాగు చేసుకుంటున్న భూములను లాక్కొని వారికి యిస్తున్నారు. గ్రామ సాముదాయిక భూములైనా సరే, ఈ జాతీయ వీరులకు, మహా జాతీయ వీరులకు యిస్తామని కొత్త విధానము ప్రకటించుట జరుగుతోంది. భూసంస్కరణలు చూస్తే, వాయిదాపడుతున్నవి. ప్రభుత్వ యంత్రాంగం బీదప్రజల పక్షాన నిలబడి వారికి చట్టరీత్యా సంక్రమింపవలసిన హక్కులు కలుగజేయుటకు తోడ్పడకుండా, భూస్వాములవైపు నిలబడి పనిచేస్తున్నారు. సభ్యులు మాట్లాడుతూ అనేక ఉదాహరణలు యివ్వటం జరిగింది. పోలీసులు భూస్వాముల వైపుజేరి బీదప్రజలమీద ఏ విధంగా దౌర్జన్యం చేస్తున్నారో, మానుకోటతాలూకాలో జరిగినసంఘటనలు ఋజువు చేస్తాయి. ఏవిధంగా జరుగుతున్నదో అనేక ఉదాహరణలు ఇవ్వటం జరిగింది. బీదప్రజానీకంవిషయంలో వారికి ఇండ్ల స్థలాలిచ్చుటకు ప్రభుత్వం ఎటువంటి చర్యతీసుకొనుటకు తయారుకావటం లేదు. కడకు ఈ శాఖా మంత్రిగారు చెపుతూ, యీ పద్ధతిపైన వెళ్ళితే 100 ఏండ్లకైనా ఇవ్వగలమా లేదా అంటూ హరిజనులకుగాని, వెనుకబడ్డ బీద ప్రజానీకమునకుగాని ఇండ్ల స్థలాల సమస్య గురించి ఏమీ చేయలేము, చేయటానికి పూనుకోవటం లేదు, అనే రీతిగా సమాధానం చెప్పారు. కనీసం వేతనాల చట్టాన్ని వ్యవసాయ కూలీలకు అమలు జరుపుటకు వెంటనే చర్యతీసుకోవాలంటే, సంజీవయ్యగారు, కొంతమంది మంత్రులు చల్లని మాటలతో, తియ్యని మాటలతో చేస్తామని సంతృప్తికరంగా మాట్లాడారు గాని, ఆచరణలో చేయగలిగింది ఏమీలేదని అంటున్నారు. హరి

జనులకు, యితర బీద ప్రజానీకానికి విద్య, వైద్యసౌకర్యాలు ఉచితంగా ఇచ్చి వారిని ముందుకు తీసుకువచ్చేందుకు ప్రభుత్వం పూనుకుంటుందా అంటే, దానికి కూడా ఉత్త చేతులు బయటపెట్టారు. ఒకప్రక్క ఆహారధాన్యాల ధరలు పెరుగుతున్నాయి. కొంతమంది మంత్రులు, ముఖ్యంగా వ్యవశాయశాఖమంత్రి యీ ధరలు చాలవని, ఇంకా ఎక్కువ ధరలు కావలెనని చెప్పటం ఆరంభించారు. చౌక డిపోలు పెట్టమంటే సాధ్యంకాదని, మనవద్ద కావలసిన బియ్యం లేవని, కేంద్రంయిస్తే సాధ్యం అవుతుందని లేకపోతే లేదని చెప్పారు.

పరిశ్రమల విషయంచూస్తే, పెట్టుబడిదారులు, లక్షలకు లక్షలకు మింగితే చర్యతీసుకొనుటకు సాధ్యంకాదని, జరిగిపోయినదేదో జరిగిపోయిందని అంటూ, లక్షలు మింగి, పరిశ్రమలు మూలపడి, సర్వనాశనం చేసినతరువాత పునరుద్ధరణకు సలహాలు కావాలంటున్నారు. జరిగిపోయినదానికి విచారించి ఏమిలాభం అంటారు. కాని బీదరైతులు తక్కావీ బాకీలు తీర్చుకొనేందుకు మళ్ళీ పంటలు వచ్చేవరకైనా వాయిదా యివ్వమంటే ససేమిరా యివ్వము, యివ్వము అంటారు. ఈ పెట్టుబడిదారులు లక్షలు మింగి ఆస్థులుకూడగట్టుకున్నా, వారి నుంచి తిరిగి రాబట్టుకొనేందుకు అనేక చట్టాల ఆటంకాలు, ప్రభుత్వవిధానాలు ఆటంకాలు, మంత్రుల ఇష్టాలు, ఆటంకాలు వుంటూవున్నవి. పరిశ్రమల పేరుతో ప్రభుత్వం డబ్బుఇచ్చి ప్రైవేటు యజమానులకు సహాయంచేస్తున్నారు. కాని ఆ పరిశ్రమలమీద యాజమాన్యం పొందుటకు ప్రభుత్వంతగిన చర్యలుతీసుకొనుట లేదు. ఆంధ్రప్రదేశ్ ను పారిశ్రామికంగా అభివృద్ధిచేయుటకు కేంద్రప్రభుత్వంనుంచి రాష్ట్రానికి రావలసిన వాటా (పన్నుల నుంచి వసూలుచేసినది గాని, యింకేదైనా గాని) గట్టిగా రాబట్టుటకు కృషిచేయాలంటే, "మేము అడిగేది అడుగుతున్నాము, అంతకంటె ఏమీ చేయలేము, అందుచేత పారిశ్రామికంగా వెనుకపడి వుండవలసినదే" అనే రీతిగా చెపుతున్నారు.

పెట్టుబడిదారులు తీవ్రంగా లాభాలు వేసుకొంటున్నారు, పెద్ద పెద్ద పరిశ్రమలను జాతీయం చేయండి, దానివలన కార్మికులకు, ప్రజలకు సౌకర్యం కలుగుతుంది, ప్రభుత్వమునకు ఆదాయం వస్తుంది,-అని చెపితే, అది పెద్ద సమస్య అని, ఇప్పుడు సాధ్యంకాదని అంటారు; కార్మికుల విషయంలో కనీసవేతనాలు నిర్ణయించి, ఆ చట్టాలు అమలుజరుపవలెనంటే దానికి పూనుకొనుటలేదు. ఇచ్చిన అవార్డ్సుకూడ అమలుజరపటానికిహక్కు లేదని వాయిదామీద వాయిదా వేస్తున్నారు. ట్రేడ్ యూనియన్లు ఏర్పాటు చేసుకుంటే యూనియన్ల కార్యకర్తలను victimise చేయ్యటం సహజంగా జరుగుతున్నది. న్యాయమైన హక్కులు, న్యాయమైన కూలిరేట్లు, ప్రభుత్వం చేసిన చట్టాలు ప్రభుత్వ పరిశ్రమలలోనైనా అమలుజరపాలంటే సాధ్యంకాదంటారు. ఆకలిచేత కటకటలాడుతూ, మలమల

మాడుతూ కార్మికులుంటే, సమ్మెచేస్తే "డొక్క బ్రద్దలుచేస్తాం, జాగ్రత్త" అని, తియ్యని మాటలు, చల్లని మాటలు చెప్పిన సంజీవయ్యగారే యీ బెదిరింపు మాటలతో తమ ఉపన్యాసం ముగించారు.

విద్యుచ్ఛక్తివిషయం చూచినట్లయితే, భవిష్యత్తులో విద్యుచ్ఛక్తి అభివృద్ధి చేయడానికి డబ్బు లేదంటున్నారు. "గ్రామసీమలకు విద్యుచ్ఛక్తి తీసుకుపోయే దానికి యీ సంవత్సరం ఆఖరు: కేంద్రప్రభుత్వ దయాదాక్షిణ్యాలపైన ఆధారపడాలి; ఇది ఇస్తే సరే, లేకపోతే లేదని" అంటున్నారు. పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి ఎంతవరకు సరఫరా చేయగలరో తెలియదు. పారిశ్రామికంగా మన రాష్ట్రం అభివృద్ధిచెందాలంటే, విద్యుచ్ఛక్తి అవసరమైనప్పటికీ దానికి కావలసిన స్కీములు ఆరంభించటానికిశ్రద్ధతీసుకోవటంలేదు. "ఇంకింపల్లి, సీలేరు ప్రాజెక్టులను త్వరగా నిర్మించేదానికి, ఇప్పుడు ప్రారంభించబడినవాటిని పూర్తి చేసేదానికొరకు కావలసిన డబ్బు పబ్లిక్ సెక్టార్ నుంచి మనకు రావలసిన 4 వందల కోట్లు కేటాయించమంటే కేంద్రప్రభుత్వం డబ్బు లేదంటున్నారు. మేము ఎంతగట్టిగా చెప్పినా వారు వినిపించుకోవటంలేదని" చెప్పటం జరుగుతోంది. ఇరిగేషన్ ప్రాజెక్టులు, నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువకాల్వ, వంశధార ప్రాజెక్టులను ఇదివరకే ప్రారంభించామంటున్నారు. "కాని వాటిని త్వరగా పూర్తిచేయటానికి కావలసిన డబ్బు కేంద్రప్రభుత్వం ఇవ్వటంలేదు, మన దగ్గర డబ్బులేదు, అందుచేత సాధ్యంకాదని" అంటున్నారు. మన రాష్ట్రానికి రావలసిన వాటాప్రకారం, కనీసం నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువకాల్వ మొదలైన మేజర్ ప్రాజెక్టులకైనా కేంద్రప్రభుత్వమే బాధ్యత తీసుకొని, నిర్వహించేదానికి, కేంద్రప్రభుత్వ ఖాతా క్రిందనే వ్రాసేదానికి మన ప్రభుత్వం ఎందుకు ప్రయత్నంచేయలేదని అడుగుతున్నాను. "కేంద్రప్రభుత్వం డబ్బు ఇవ్వటంలేదని" యీ ప్రభుత్వం చెప్పి తప్పించుకోవటం జరుగుతోంది తప్ప. యీ పెద్దపెద్ద ప్రాజెక్టులు కడుతూ, వాటికి సంబంధించిన పిల్లకాల్వలు కూడా త్రవ్వి వెంటనే ప్రజానీకానికి సాధ్యమైనంత త్వరలో నీటి సౌకర్యాలు అందించటానికి పూనుకోవటంలేదు. కనీసం, ఇప్పుడు ప్రారంభించినటువంటి నాగార్జునసాగర్, తుంగభద్ర, కృష్ణాబారేజి ప్రాజెక్టులను త్వరలో పూర్తిచేసి, ప్రజానీకం వెనువెంటనే సాగుచేసుకోటానికి వీలైన పిల్లకాల్వలను త్రవ్వించి, ఇప్పుడున్న కాల్వలకు తగిన మరమ్మతులు చేసేదానికి ప్రభుత్వం శ్రద్ధతీసుకోవటంలేదు.

ఇక, వైద్యసౌకర్యాలు చూచినట్లయితే, మనకు ఎక్కువమంది వైద్య నిపుణులు కావలసిఉన్నది. దానికి కావలసిన డిప్లొమా కోర్సులను ప్రారంభించటానికి ప్రభుత్వం శ్రద్ధ చూపటంలేదు. గ్రామసీమల్లో వైద్యసౌకర్యాలు కలుగజేయటానికి, గ్రామాలకు వెళ్లే డాక్టర్లకు సరైన జీతాలు ఇవ్వటానికి ప్రభుత్వం

ప్రయత్నించటంలేదు. ఏదో భవిష్యత్తున నిదానంగా చేస్తామని చెబుతున్నారు. సంజీవరెడ్డిగారు "పదివేల జనాభాకు, రెండుమూడు మైళ్ళ రేడియస్‌లో కనీసం 4, 5 గ్రామాలకు ఒక హాస్పిటల్ ఏర్పాటుచేసి, ఒక డాక్టర్‌ను నియమించటం మా ఆశయమని" అన్నారు. కాని ఆ ఆశయాన్ని నెరవేర్చటానికి వారు ఏ మార్గాన్ని అవలంబిస్తున్నారో, యీ బడ్జెటులో ఎక్కడా కనబడటం లేదు.

విద్యా సౌకర్యాలు సరిగాలేవు. ఎలిమెంటరీ విద్య అందరికీ నేర్పాలంటున్నారు, పదునాల్గవ సం.రం వరకూ కాదు. కనీసం 5 వ సం.రం నుంచి 12 వ సంవత్సరం వరకైనా నేర్పాలి. ఐదేళ్ళు నేర్పండి. 14 ఏళ్ళవరకు నిర్బంధవిద్య చేస్తామనే పేరుతో ఎలిమెంటరీ విద్యావిధానాన్ని భీభత్సం చేయటం జరుగుతోంది. వాళ్ళకు చదువు చెప్పించేదానికి ఏర్పాట్లులేవు. మంత్రిగారు ఒక అద్భుతమైన ఆశ్చర్యకరమైన విషయం చెప్పారు. "విశ్వవిద్యాలయాల్లో తెలుగు భాషలో బోధించటం మా ప్రభుత్వవిధానం కాదు; అక్కడ బోధన ఇంగ్లీషులో సాగాలి; ఇంగ్లీషు పోయిన తర్వాత హిందీలో బోధన సాగిస్తాము; అంతేగాని విశ్వవిద్యాలయాల్లో మాతృభాషలో బోధించటం సాధ్యంకాదని" యీ ప్రభుత్వము తరఫున విద్యామంత్రిగారు చెబుతున్నారంటే, ఆయన ఏ ప్రపంచంలో ఉన్నారో, ఎక్కడఉన్నారో అర్థంకావటంలేదు. ప్రభుత్వవిధానము ఇదే అయినట్లయితే మరొక పర్యాయము హెచ్చరిక చేయవలసి ఉంటుంది. ఈ రోజు యీ ప్రభుత్వానికి పెద్ద మెజారిటీ ఉండవచ్చును. ఈ ప్రభుత్వమే కాదు, ఏ ప్రభుత్వమైనా సరే, విశ్వవిద్యాలయాల్లో ఎల్లకాలం బోధనా భాషగా ఇంగ్లీషు, ఇంగ్లీషు పోయిన తర్వాత హిందీ ఉంచుతామంటే, అది అసంభవమైన విషయమని ప్రభుత్వమునకు తెలియజేస్తున్నాను. విశ్వవిద్యాలయాల్లో మాతృభాషలో గాక ఇంగ్లీషులో, తర్వాత హిందీలో ఎల్లకాలం బోధించటం యీ ప్రభుత్వ తరంకాదని చెబుతున్నాను. ఈ విషయాన్ని మీరు గుర్తించకుండా, విశ్వవిద్యాలయాల్లో ఎల్లకాలం ఇంగ్లీషులోనో, హిందీలోనో బోధించేదానికి ప్రయత్నం చేసినట్లయితే, దేశంలో పెద్ద బ్రహ్మాండమైన గందరగోళానికి దారితీసేదాని కొరకు మీరు పూనుకొంటున్నట్లు అవుతుందని చెబుతున్నాను. ఉపాధ్యాయుల జీతాలు పెంచమంటే, వారి జీతాలు పెంచటానికి నిరాకరిస్తున్నారు. ఎక్కువ జీతాలు కావాలని కోరితే, వారి సంఘాలను నిషేధిస్తామంటున్నారు. "హైకోర్టు జడ్జిమెంటుతో మాకు ప్రసక్తిలేదు, కాన్‌స్టిట్యూషన్‌తో మాకు ప్రసక్తిలేదు. మాకు వ్యతిరేకంగా ఎవరైనాచేస్తే, న్యాయమైన హక్కులకు నిలబడితే వాళ్ళను అణచివేయటమే మా పని" అని విద్యామంత్రి బెదిరిస్తూ మాట్లాడారు.

విద్యాశాఖా మంత్రి ( శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు ) : హైకోర్టు జడ్జిమెంటుతో ప్రసక్తి లేదని గాని, కాన్‌స్టిట్యూషన్‌తో ప్రసక్తిలేదని గాని నా ప్రసంగంలో ఎప్పుడూ చెప్పలేదు. హైకోర్టు జడ్జిమెంటును మన్నించామని చెప్పాను. కాన్‌స్టిట్యూషన్ ప్రకారం పరిశీలించేయించమని చెప్పాను. దానికి విరుద్ధంకాకుండా సర్వీసు రూల్సు ఏర్పాటుచేయమని మనవిచేశాను.

శ్రీ పి. సుందరయ్య : అది భవిష్యత్‌లో కోర్టులు, బయట ప్రజలు నిర్ణయిస్తారు. వారుచేసింది కాన్‌స్టిట్యూషన్‌కు గాని, హైకోర్టు నిర్ణయాలకుగాని విరుద్ధంగా ఉన్నదో లేదో వారే నిర్ణయిస్తారు. "సంఘాలను నిషేధిస్తాము, పత్రికలు నిషేధిస్తాము. చూడు మా తడాఖా" అని బెదిరిస్తే వారికి నేను గట్టిగా చెప్పవలసిఉంటుంది. ఈరోజు మీకు బలంఉంది. కాని బెదిరింపులతో, సైన్యంతో, పోలీసులతో ఉపాధ్యాయుల నణచివేసి, పరిపాలన, మీరు సాగించాలనుకొంటే, సాధ్యమయ్యే విషయం కాదని చెబుతున్నాను. మీరు వారి సంఘాలను నిషేధించవచ్చును. వారి పత్రికలను నిషేధించవచ్చును. ఈ నిషేధాలు మాకు కొత్త కాదు, దేశానికి కొత్తకాదు, కాంగ్రెసుపార్టీకి కూడ కొత్తకాదు. కాబట్టి యీ విధమైన బెదిరింపులతో లాభంలేదు. ప్రభుత్వం న్యాయమైనదానిని గురించి ఆలోచించవలసిఉంటుంది.

కమ్యూనిటీ డెవలప్‌మెంట్ బ్లాకులు పెట్టి కొంత మార్పు తీసుకు వస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాలకు, వెనుకబడిన ప్రజలకు ఉపయోగకరంగా ఉండేటట్లు ప్రభుత్వం ఇచ్చేదేదో ఇచ్చి, స్థానిక సంస్థలద్వారా వాటిని అభివృద్ధి చేసేదానికి చూడమంటే, "ఆరకంగా కాదు, కంట్రిబ్యూషన్ ఇస్తేనే వాటిని చేస్తామని" ప్రభుత్వం పదేపదే చెబుతున్నది. మేము ఎన్ని సంవత్సరాలు యీ విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చినా, ప్రభుత్వం తన విధానాన్ని మార్చుకోడానికి తయారుకావటంలేదు.

ప్రభుత్వ పరిపాలన యంత్రం చూస్తే, అది ఉద్యోగుల పరిపాలన అనే సంగతి మనకు తెలుస్తుంది. పైనుంచి క్రిందివరకు ఉద్యోగుల పరిపాలన తప్ప ఇంకొకటి లేదు. ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధుల స్థానం ఏమిటన్నది చూస్తే, వారు ప్రభుత్వానికి సలహా చెప్పటం తప్ప, వాళ్ళకు ఏ హక్కులు ఇవ్వటంలేదు.

గత మూడేళ్ళుగా జిల్లాబోర్డులు ఏర్పాటుచేయమంటే, "స్పెషల్ ఆఫీసర్సు గడువు పొడిగించాము ; జిల్లాబోర్డులు ఏర్పాటుచేస్తాము" అని చెబుతూ కూడ, స్పెషల్ ఆఫీసర్సు యొక్క గడువును పొడిగించటం జరుగుతున్నది. ప్రజలచేత ఎన్నుకోబడిన వారితో జిల్లాబోర్డులు ఏర్పాటుచేయరు. జిల్లాబోర్డు యొక్క అధికారాలను పెంచరు. ప్రజలచేత ఎన్నుకోబడినవారే జిల్లాకు సంబంధించిన

పరిపాలనా వ్యవహారమంతా నడిపేటట్లు చేయాలి, వారిక్రిందనే అన్నిశాఖల ఉద్యోగస్థులు ఉండాలి. ఈ జిల్లాబోర్డులు సక్రమంగా పనిచేయకపోతే, వాటిని తీసివేసే అధికారం, ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభ్యుల నుంచి వచ్చిన ప్రజా మంత్రివర్గానికే ఉండాలి తప్ప, ఉద్యోగస్థులకు ఉండకూడదు. ఆవిధంగా ప్రజా ప్రతినిధులకే అధికారాలు ఇచ్చేదానికి యీ ప్రభుత్వం ఆలోచించటంలేదు. ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులతో కనీసం జిల్లాబోర్డులు ఏర్పాటు చేయమంటే, ప్రభుత్వం ఇంతవరకు ఇదమిద్ధమైన పాలసీకి రావటంలేదు. " ఆలోచిస్తాం, చేస్తాం, మాఉద్దేశం అదే" అని అంటున్నారు తప్పితే, డెఫినిట్‌గా " మేము ఫలానా నెలలో జిల్లాబోర్డులకు ఎన్నికలు పెట్టి ప్రజలచేత ఎన్నుకొన బడినవారితో జిల్లాబోర్డులు ఏర్పాటుచేస్తాము" అని ఇంతవరకు ప్రభుత్వం చెప్పటంలేదు,

చిన్నచిన్న ఉద్యోగస్థుల జీతాలు పెంచమంటే, "మా దగ్గర డబ్బులేదు ; పెంచడానికి సాధ్యంకాదు" అంటున్నారు. పెద్ద ఉద్యోగస్థుల జీతాలు తగ్గించ మంటే "అది మా చేతుల్లో లేదు, మేము చేయలేము" అంటున్నారు. శాసన సభ్యులు వ్రాసే జాబులను, వారు ఇక్కడ వేసే ప్రశ్నలను, కోత తీర్మానాల సందర్భంలో జరిగిన చర్చలను, ప్రభుత్వం శ్రద్ధగా తీసుకొని, వాటికి విలువఇచ్చి, ఆలోచించటానికి ప్రయత్నించటంలేదు. వారు ఇచ్చే సమాధానాలు వెక్కిరింపుగా, ఎగతాళిగా, నిర్లక్ష్యంగా ఉంటున్నవి. సభ్యులు చేసిన అనేక రిప్రజెంటేషన్స్ సక్రమంగా తీసుకొని వీటినిగురించి విచారించి, "ఇదిగో, ఇది జరిగింది, మేము విచారించాము, దీని ఫలితం ఇది" అని ప్రభుత్వం యింతవరకు చెప్పలేదు. ఈపద్ధతి ఢిల్లీ పార్లమెంటులో జరుగుతుండగా ఇక్కడ దానిని అనుసరించటానికి ఎందుకు ప్రయత్నించరో తెలియదు. ఢిల్లీలోనూ కాంగ్రెసు ప్రభుత్వమే ఉన్నది. అది చేస్తుంటే, యీ ప్రభుత్వం మాత్రం ఎందుకు చేయదని అడుగుతున్నాను. ఇంతవరకు యీ ప్రభుత్వం ఆ విధంగా విచారించి చెప్పేదానికి చర్యలు తీసుకోలేదు. ఇకముందు తీసుకొంటుందనే ఆశ కూడా అట్టే కనుపించటంలేదు.

ఇక రాష్ట్రి జిల్లా వ్యవహారాలున్నవి. గ్రామోద్యోగస్తుల వ్యవహారాలకు వచ్చినప్పుడు గ్రామోద్యోగుల జీతాలు కొంచెం పెంచండనిచెబితే, "లేదు; వారి అంతు ఏదో కూడా చూడాలి. వారికి కావాలంటే చట్టాలు మార్పుచేస్తాం" అన్నారు. చట్టాలు మార్పుచేయవచ్చు ఢిల్లీలో కాంగ్రెసు ప్రభుత్వం వున్నది. రాజ్యాంగచట్టంకూడా మార్చి **Fundamental** హక్కులను రద్దుచేయడానికికూడా వారికి సామర్థ్యం ఉంది. అదిలేదని శంకించడంలేదు. న్యాయమైన కోర్కెలను అడిగినప్పుడు బెదిరింపులతో సమాధానం ప్రభుత్వవిధానంక్రింద జరుగుతోంది. తరువాత పన్నులవిషయం తీసుకోండి. ప్రజలమీద యింకా అధికంగా పన్నులు వేయడానికి చూస్తున్నారు. వేస్తాం అని చెప్పారు, ఇదివరకే వేశారు. పోనీ

మన అభివృద్ధి ప్రణాళికలకు, చిన్నఉద్యోగస్తుల జీతాలు పెంచడానికి డబ్బు కావలసివుంటే కేంద్రంనుంచి మనకు రావలసిన వాటా రాబట్టుకునేది ఒక ఎత్తు. ఇక్కడకూడా యింకా ఏమైనా వసూలు చేయడానికి వీలుంటే, అదనంగా పన్నులు వేయవలసివస్తే ధనికులమీద వేయండి. ఆర్థికమంత్రిగారు సలహాలు చెప్పమని, నిర్మాణాత్మకమైన సూచన లివ్వమని అడిగారు. ఇచ్చిన సూచనలను పాటించలేదు. పన్నులు ఏరీతిగా ఉండాలో పరిశీలించేదానికి ఒక కమిషనును వేయాలని సూచిస్తే తమయొక్క జవాబులో ఆర్థికమంత్రిగారు అసలాప్రసక్తే ఎత్తుకోలేదు. అది ప్రతిపక్షసభ్యులు మాత్రమే చేసిన సూచన కాదు. కాంగ్రెసుసభ్యులలో చాలమంది ఆ సూచనలు మంచివన్నారు. కాని మంత్రిగారికి నచ్చలేదు. సూచనలు మంచివి చేయండని చెప్పినతరువాత ఒకటి రెండు మంచిసూచనలు కూడా ఆయనకు యిష్టంలేక యిష్టంలేదని చెబితే యేమిచిక్కు వస్తుందోనని వాటిప్రసక్తే ఎత్తుకోలేదు. ఈ సూచనలు వారు చెవిఒగ్గి వినలేదని వారి సమాధానమే రుజువుచేస్తూంది. ధనికులమీద పన్నులు వేయడానికి నిరాకరిస్తున్నారు. కేంద్రంనుంచి డబ్బు రాబట్టుకోడానికి తయారు కావడంలేదు. "Finance Commission కు వ్రాశాము; కేంద్రానికి విన్నవించుకున్నాం." అంటారు తప్పితే రాబట్టుకోడానికి మార్గం యేమీలేదు. కేంద్రంలోవున్న బంట్రోతులకుకూడా పెద్దజీతాలు యిస్తూంటే యిక్కడున్న గుమాస్తాకిగాని చిన్నచిన్న ఉద్యోగస్థులకుగాని, ఉపాధ్యాయులకుగాని తిండి లేకుండావుంటే ఎంతకాలం యీ ప్రభుత్వాన్ని యీరకంగా నడపగలమని అనుకుంటున్నారు. బెదిరింపులతో చిన్నఉద్యోగస్థులను అణచివేసి ఒకప్రక్కన అదేపని చేస్తున్నట్టి కేంద్ర ఉద్యోగస్థులు వాళ్ళకు జీతాలు చాలడంలేదని సమ్మెలుచేయడానికి తయారైతే కమిషనునువేసి వాళ్ళజీతాలు పెంచడానికి, యితర సౌకర్యాలు యివ్వడానికి కేంద్రప్రభుత్వం ఒకప్రక్కన చూస్తుంటే, "వీరుమాత్రం అట్టడుగున ఉండాల్సినదే, అధోగతిలో ఉండాల్సినదే, మీకు ఒక్కదమ్మిడీ ఎక్కువచేయటానికి చాతకా"దంటే దానిఅర్థం యేమిటి? "కేంద్రప్రభుత్వం అక్కడ ఉద్యోగస్థులంతా సమ్మెచేస్తామని notice లు యిస్తే సమ్మతించారు కనుక మీరుకూడా బెదిరింపులను లక్ష్యంచేయకుండా మీరుకూడా సమ్మెచేసి కేంద్ర ఉద్యోగస్థులతోపాటు మీరుకూడా నిలబడితే అప్పుడు కేంద్ర ప్రభుత్వమే మీ కేమయినా యిస్తుంది" అని పరోక్ష సలహా ఇస్తున్నారా? అదేదోస్పష్టంగానైనా చెప్పినట్లయితే ఇక్కడుండే ఉద్యోగస్థులు కేంద్రప్రభుత్వోద్యోగస్థులనుసరించిన పద్ధతినే అనుసరించి తమహక్కులను సాధించుకుంటారు. అందుచేత ఆఖరుకు ప్రభుత్వ విధానంయేమిటి? కేంద్రప్రభుత్వంనుంచి మనకు రావలసినటువంటి డబ్బుగాని హక్కులుగాని ఏవీకూడా రాబట్టుకోడానికి శక్తిలేక "మేముదానిగురించి చేయగలిగింది యేమీలేదు" అంటున్నారు. ఢిల్లీలోవున్నది

యింకోపార్టీ ప్రభుత్వం అయితే అనుకోవచ్చు. అదికూడా కాంగ్రెసుప్రభుత్వమే అయినప్పుడు "ఇదిగో యీ రకంగావుండి, ప్రజలకు కావలసినవి, చిన్న ఉద్యోగస్థులకు కావలసినవి, అన్ని సౌకర్యాలకోసము యిప్పుడు మారాష్ట్రాన్నుంచి వసూలుచేసే మొత్తండబ్బునుంచి, excise వల్ల కానివ్వండి, ఎగుమతులు దిగుమతులపై వేసిన సుంకాలవల్ల కానివ్వండి, ఆదాయపుపన్నువల్ల కానివ్వండి, అనేకరకాలుగా మీరు మారాష్ట్రంనుంచి వసూలుచేసేపన్నులలో, అదేరకంగా యితరరాష్ట్రాలనుంచి వసూలుచేసే పన్నులలో రాష్ట్రానికి ఎక్కువ వాటా యివ్వకపోయినట్లయితే యీ పరిపాలనాయంత్రాన్ని నడపడం సాధ్యంకాదు. మీరు ఆరీతిగాచేస్తే చేసినట్టు. లేకుంటే అంతా కేంద్రమే తీసుకోండి. కనీసం మా ప్రజలు బాగుపడతారు, చిన్నఉద్యోగస్థుల జీతాలయినా పెరుగుతవి. మీరు వినిపించుకోవడంలేదు కనుక మీరే దానిని నడపండి" అని కేంద్రప్రభుత్వాన్ని అడగడానికి మంత్రివర్గం ఎందుకుతయారుకాలేదు ? ఆఖరుకి యీ ప్రభుత్వం చేయగలిగింది పైనుంచి పెత్తనం చెలాయిస్తూ ఆంధ్రదేశంలోని ప్రజానీకానికి అన్యాయంచేసే కేంద్రప్రభుత్వాన్ని దాని విధానాలను ఎదుర్కోలేక, పైనుంచి మొట్టికాయలు వేసేవాళ్ళను ఎదుర్కోలేక. పెత్తనం చెలాయిస్తున్నవాళ్ళను ఎదుర్కోలేక, తమ క్రింద అధీనంలోవున్న కార్మికులను బెదిరిస్తున్నారు, ఉపాధ్యాయులను బెదరిస్తున్నారు, చిన్న ఉద్యోగులను బెదిరిస్తున్నారు, గ్రామోద్యోగులను బెదిరిస్తున్నారు, విద్యార్థులను బెదిరిస్తున్నారు. ఈ విధంగా అందరినీ బెదిరిస్తూ, ప్రజలను అణచడానికి పూనుకుంటున్నారు. ఇలాంటి విధానాలతో ప్రభుత్వం సాగుతున్నప్పుడు, మేము చర్చలోచేసిన సూచనలేకాకుండా కాంగ్రెసు బెంచీలనుంచి వచ్చిన అనేక సూచనలనుకూడా పెడచెవినిపెట్టి మరోవిధానాన్ని అనుసరిస్తున్న ప్రభుత్వానికి యీ Appropriation Bill ద్వారా డబ్బు మంజూరు చేయడం అనేది ఏరీతిగానూ న్యాయంకాదు. అందుచేత విధానాలు మారనంత కాలం మేము చేయగలిగిన కనీస కర్తవ్యం యేమిటంటే యీ ప్రభుత్వానికి యీ డబ్బుఇవ్వడానికి మేము అంగీకరించడంలేదనే సంగతి ప్రజానీకానికీ యీ ప్రభుత్వానికీ అందరికీ మరొకపర్యాయం స్పష్టంగా తెలియడానికి మేము యీ Appropriation Bill ను పూర్తిగా వ్యతిరేకిస్తున్నాము.

*డాక్టరు బి. గోపాలరెడ్డి : అధ్యక్షా ! మామూలుగా ఈ Appropriation Bill ఏదో ఒక మంగళవాచకంగా వుండే సాంప్రదాయను వుంటూ వచ్చింది. ఈచర్చలలో పాల్గొన్నట్టి సభ్యులందరినీ మంత్రి అభినందించడం, వారిని యితర సభ్యులంతా అభినందించడం, ఏదో 20 దినాలు యుద్ధం చేసుకున్నాం; ఈనాడయినా కొంచెం సంతోషిద్దాం, మిఠాయి పుచ్చుకొందాం అనే భావంలో యీ చర్చ జరుగుతుందేమోనని ఆశించాను. అనేక ఆశలతో పాటు యిదికూడా నిరాశే అయినది. ఇరవై దినాల చర్చ చాలనట్లు మళ్ళా

యీ దినంకూడా, ద్రవ్యానికి సంబంధించిన విషయాలు, లోటుకు సంబంధించిన విషయాలు, గడచిన 20 దినాలలో చెప్పకుండా దాచుకొని యీనాడయినా చెబుతారని ఎదురుచూచినాను. అదికూడా కాలేదు. సాధారణ చర్చలో ఏ విషయాలపై చర్చలు జరిగినాయో మంత్రుల జీతాల పద్దుమీద ఏ చర్చలు జరిగినాయో, వ్యవసాయం, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, విద్య వగైరా పద్దుల మీద ఏ చర్చలు జరిగినాయో అవే చర్చలు యీనాడుకూడా జరిగినాయంటే నా కంత సంతోషంగా లేదు. ఈ నాడు ఒకరినొకరిని అభినందించుకోవాల్సిన తరుణం యిది. వారు నన్ను ఒకవేళ అభినందించలేకపోయినా...

శ్రీ పి. సుందరయ్య : సాయంకాలం విందులో ఒకరి నొకరము అభినందించుకుందాం.

డాక్టరు బి. గోపాలరెడ్డి : సాయంత్రానికి పురోగామిగా ఈ దినం ఉదయం కూడా అభినందన చేసుకుంటే బాగుండేదేమో, ఇంకా, సరైన వాతావరణం సాయింత్రం అక్కడ వుంటుందేమోనని అనుకున్నాను. కాని యీనాడు అనేక విషయాలు చెప్పడమేకాకుండా కడపటికి యీ Appropriation Bill కు మేము సమ్మతించడంలేదని శ్రీ సుందరయ్యగారు చెప్పినారు. అంటే ఒకవేళ వారు చెప్పినటువంటి అభిప్రాయమే సభవారు అంగీకరించినట్లయితే ప్రభుత్వం రాజీనామా పెడుతుంది. తరువాత ఆగష్టు ఒకటవ తేదీనుంచి ప్రభుత్వానికి అసలు దమ్మిడీ ఖర్చు చేయడానికికూడా అధికారం ఉండదు. మరల శాసనసభ వచ్చేంతవరకూ గవర్నరు అధికారం తీసుకొని చెలాయించవలసిన అవసరం కూడా ఏర్పడుతుంది. గవర్నరుగారు అధికారం తీసుకోవడం వారి అభిప్రాయం కాదేమో అనుకుంటాను. ప్రభుత్వం రాజీనామా పెట్టాలనికూడా వారి ఉద్దేశ్యం కాదనుకొంటాను. ఆ వుద్దేశ్యమే వుంటే, ప్రభుత్వం ఏ విధమైన తప్పిదాలు, ద్రోహాలు చేసివుంటే తప్పకుండా మంత్రివర్గం మీద విశ్వాసరాహిత్య తీర్మానం తీసుకుని రావచ్చుగాని యీనాడు ప్రభుత్వానికి డబ్బు ఖర్చుచేసే అధికారం యివ్వకపోతే రేపు ఆగష్టు ఒకటవ తేదీనుంచి peons మొదలుకుని పైవారి వరకు, కావలసిన జీతాలకు ద్రవ్యం లభించదు. మీ రిచ్చిన vote on account జూలై 31 వ తేదీకి అయిపోతుంది. ఆగష్టు ఒకటవ తేదీనుంచి ద్రవ్యం కావాలని చెబుతున్నప్పుడు "దానిని మేము నిరాకరిస్తాం అంటే దానియొక్క అర్థం నాకు పూర్తిగా అర్థంకావడం లేదు. కాని కాంగ్రెసు పక్షంవారు ప్రతిపక్షమువారు కూడా అనేక విషయాలు చెప్పినారు. కొంత ఆవేదనతోకూడా చెప్పినారు. "మా మా జిల్లాలలో, మా మా బ్లాకులలో, మా మా తాలూకాలలో పనులు యింకా సక్రమంగా జరగడంలేదు. ప్రభుత్వం ద్రవ్యం దుబారాగా ఖర్చు అవుతున్నది. సక్రమంగా వినియోగించవలసినది" అని కొంత ఆవేదనతో

చెబుతున్నారు. చాలా సంతోషకరమైన విషయం. ఆ ఆవేదనలతో మాకు సంపూర్ణమయిన సమ్మేళన వుంది. సానుభూతి వుంది. దానితో ఏకాభిప్రాయం కాక ఇంకొకటి యేమీ కాదు.

కాని కొంతవరకు పనిచేసేవారికికష్టాలుంటాయి. సలహాలుచెప్పడం చాలా తేలిక. హిదాయత్ చెప్పడం తేలిక. కాని ఒక కార్యాన్ని నిర్వహించడమంటే, అనేక సాంప్రదాయాలతో ఉన్న ప్రభుత్వాన్ని కొన్ని వేలమంది, లక్షలమంది ఉద్యోగులు, గ్రామోద్యోగులు మొదలుకుని ఛీఫ్ సెక్రటరీతో సహా ఉన్న ఉద్యోగులు అందరితోను కలిసిన (**machinery**) యంత్రాంగం ద్వారా ఒకపని జరగాలంటే ఎంత ఆయత్తం కావాలో, ఎంత ఏర్పాటుకావాలో ప్రభుత్వంలో ఉన్నవారికే తెలుస్తుంటుంది. ఈనాడు సభ్యుల మాటల ప్రకారం అంత వేగంగా కార్యరూపంలో మేము పరుగెత్తలేకుండా పోతున్నాము. దీనికి కారణం ధనాభావం కావచ్చును. ప్రభుత్వయంత్రాంగం మీరు అనుకొన్నంత తేలికగా ఒక్కసారిగా నడవడానికివీలులేదు. ఆ కారణం కావచ్చును. ప్రభుత్వం అన్నప్పుడు, ప్రజలద్రవ్యం అన్నప్పుడు సక్రమంగా అంచనాలు వేసి సక్రమమైన అధికారాలు పొంది ఖర్చుచేయాలేకాని మన ఇష్టంవచ్చినట్లు, మన స్వంతడబ్బు ఖర్చుపెట్టినట్లు పెట్టడానికి వీలులేదు. మనం అందరము, ప్రతి ప్రభుత్వోద్యోగి, ప్రతి **Head of the Department** కూడా ట్రస్టీలు. అక్కడ అక్కౌంటెంట్ జనరల్ కూర్చుని ఉన్నారు. కొన్ని మర్యాదలు మీరు పాటించాలని పదే పదే చెబుతున్నాడు. కాబట్టి కొన్ని విషయాలలో కొంత ఆలస్యం అవుతుంటుంది. అనేక విషయాలను మేము చేయడంలేదని అన్నారు. నిజమే; చేయడంలేదు. ఎందుకు చేయడంలేదో కొంచం సానుభూతిపూర్వకంగా ఆలోచించండి. దీనికి కారణం ధనాభావం. ఎన్నో శతాబ్దాలనుంచి, సహస్ర శతాబ్దాలనుంచి ఉన్న **arrears**ను, చేయని పనులను, పూర్వపు రాజ్యాంగాలు, మంత్రివర్గాలు' ఇంతకుముందున్న మహా ప్రభువులందరు చేయని కార్యాలన్నీ ఒక్కసారిగా రెండు మూడు సంవత్సరాలలో, పది సంవత్సరాలలో చేయండి అని ప్రజలు ఆతురత పడడం సహజమే. కాని చేయకపోవడం కూడా సహజమే అని నేను అనుకుంటు న్నాను. ఇంతకుముందు ఎన్నాళ్ళనుంచో వీరందరు ప్రయత్నంచేశారు. అందరు చేయలేకపోతున్నారు. దానికి కారణాలున్నాయి. ఈనాడు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. పల్లెసీమలవైపు దృక్పథం మరల్చాలని ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నది. ఇప్పుడిప్పుడే పనులు ప్రారంభించారు. 100 మైళ్ళ దూరం పోవలసియున్నది. ఈనాడు మూడు, నాలుగు, అయిదుమైళ్ల దూరం మాత్రమే వచ్చారు. 95 మైళ్లు పోలేదు అని పదే పదే చెప్పిన తరువాత కొంత లాభం ఉండవచ్చునేమో నాకు తెలియదు కాని, పనిచేసేవారె, భారంవహించే వారి బాధ్యత సభ్యులు కొంత సానుభూతిపూర్వకంగా చూడలేదేమోనని

అనిపిస్తున్నది. నిజమే; ప్రజలందరూ కోరుతున్నారు. మాకు రోడ్డుకావాలి, మాకు స్కూలుకావాలి, ప్రైమరీ విద్యకావాలి, హరిజనులకు ఇండ్లనివేశనస్థలాలు కావాలి-ఈ రకంగా కోరడం సహజమే, వీటికంతకు డబ్బు ఎక్కడనుంచి తీసుకురావాలి, ఎవరిమీద పన్నులు వేయాలి, అనేవిషయం ఆలోచించాలి. ఎవరో మహారాజులు, ఐశ్వర్యవంతులున్నారు. వారిమీద పన్ను వేయడానికి ఆర్థికమంత్రి, మంత్రివర్గం వెనుదీస్తున్నారనేమాట వాస్తవమైనమాట కాదు. ఇంతకుముందు ప్రశ్నోత్తరముల సమయములో చెప్పినాను. రు. 1000 లకు పైగా జీతాలు పుచ్చుకుంటున్నవారు ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద, ఛీఫ్ సెక్రటరీ, హైకోర్టు జడ్జీలు, పోలీసు ఇనస్పెక్టర్ జనరల్ మొదలైనవారి నందరిని కలుపుకొని, 75 మందివరకు మాత్రమే ఉన్నారు. మహారాజులు, ఐశ్వర్య వంతులని పదేపదే చెబుతున్నారే! ఎవరువీరు? వీరి నిర్వచనం ఏమిటి? ఎంత మంది ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నారు? ఈ విధంగా ఆలోచించి పన్నులు వేయా లంటే వారు అనుకున్నంతమంద లేరేమో అనిపిస్తోంది. కేవలం 10 ఎకరాల భూమి ఉన్నవారందరిని మహారాజులంటారేమో నాకు తెలియదు. మనం ఎవరిని నిందించి ప్రయోజనంలేదు. మనకు పెద్దపరిశ్రమలు లేవు. పెద్దవాణిజ్యం లేదు. పెద్ద రేవుపట్టణాలు లేవు. చుట్టుప్రక్కల ఉన్న మద్రాసు, మైసూరు రాష్ట్రాలతో పోల్చిచూచినా అనేక విషయాలలో వెనుకంజలోనే ఉన్నాము. బొంబాయి రాష్ట్రంతో పోల్చిచూస్తే చెప్పనక్కరనేలేదు. తెలంగాణాలో ఎంతమంది, ఆంధ్రలో ఎంతమంది మహారాజులున్నారో లెక్కలు వేసుకుంటే మంచిదేమో, దీనికి నిర్వచనం ఏమిటో చెప్పండి. ఇంత ఆదాయం వచ్చినవారు మహారాజులు అని చెబితే లెక్కలు తయారుచేయడానికి ప్రయత్నం చేస్తాము. నాకు తెలిసినంతవరకు రు. 1000 లు పైగా జీతాలు వచ్చేవారు ఉద్యోగులలో 75 మంది ఉన్నట్లే మూడుకోట్లమంది ప్రజలలో మీరు అనుకున్న ఐశ్వర్యవం తులు చాలామంది లేరు. కొద్దిమందే ఉన్నారు. వారికికూడా బాధ్యతలు ఎక్కువ అవుతున్నాయి. సంతానం అభివృద్ధి అవుతున్నది. వారికి సోదరులు, కుటుంబాలు, కూతుళ్ళు ఉంటున్నారు. వీరిఖర్చులన్నీ పెట్టుకుంటున్నారు. వీరికి నిలిచేదేమీలేదు. ఏమైనప్పటికీ, ఎవరోఉన్నారు; వారిని నీవు తాకడంలేదు అనడం సరికాదు. వారినికూడా తాకుతూనే ఉన్నారు. మేము తాకలేక పోయినా ఇండియాప్రభుత్వంవారు వారిదగ్గరనుంచి పన్నులు వసూలుచేస్తు న్నారు. సంపద పన్నుమీద, ఖర్చుపన్నుమీద ఎంతెంత విమర్శలు వస్తున్నా ధైర్యం వహించి ముందుకు పోతున్నందుకు మనం సంతోషించాలి. ఎవరినో **protect** చేస్తున్నాము, మహలులో పెట్టుకుంటున్నాము అనేమాట లేదు, ఈ నాడు ప్రభుత్వం అనేక విషయాలు చేయలేదని మీరు మాకు జ్ఞాపకంచేశారు. గ్రామోద్యోగులకు ఏమీ చేయలేకపోయారు; ఉపాధ్యాయులకు ఏమీ చేయలేక

పోయారు; ఎన్. జి. ఓ. లకు ఏమీ చేయలేకపోయారు. అని చెప్పారు. చేయలేకపోవడమేకాదు. అదిరిస్తున్నారు, బెదిరిస్తున్నారనే మాట చెబుతున్నారు. ఈనాడు అదిరించేది, బెదిరించేది ఎవరు? ప్రభుత్వం అదిరిస్తున్నదా? లేక గ్రామోద్యోగులు, ఎన్. జి. ఓ. లు, పోలీసు కానిస్టేబుల్సు— ఎవరు ఎవరిని అదిరిస్తున్నారు? నాకు తెలుసును— గ్రామోద్యోగులు ఎంతెంత తీర్మానాలు చేస్తున్నారో; ఎటువంటి ఉద్రేకమైన ఉపన్యాసములు చెబుతున్నారో; ఎటువంటి దృక్పథాన్ని అవలంబిస్తున్నారో. ఈనాడు అదిరించేది, బెదరించేది ప్రభుత్వం కాదు. నిజమే; వారికి జీతాలు తక్కువే. ఎక్కువచేయకూడదనేవారెవరూ లేరు. వారు కష్టాలుపడుతున్నారు. గ్రామోద్యోగులకు ఎక్కువ సౌకర్యాలు చేస్తే నామట్టుకు నేనుకూడ సంతోషిస్తాను. ఉపాధ్యాయులకైనా ఎన్.జి.ఓ. లకైనా జీతాలు పెంచవలసినదే. ఎవరు కాదనగలరు? హృదయంగలవారెవరూ వీరికందరికి సక్రమమైనజీతాలు ఇస్తున్నామని ఇంతకంటె ఎక్కువ పెంచవలసిన పనిలేదని చెప్పలేరు. సానుభూతి అయితే ఉన్నది కాని, ద్రవ్యం ఎక్కడనుంచి తీసుకురావాలన్నదే ప్రశ్న. ఇప్పుడే ఎవరితోనో చెప్పినాను— సానుభూతి లేక కాదు. ప్రభుత్వమునకు విభూతి లేకుండా ఉన్నపుడు సానుభూతితో ప్రయోజనం ఏమిటి? మనకు ఐశ్వర్యం, ద్రవ్యం ఉంటే తప్పకుండా ఈ రెండు, మూడు రూపాయలు తీసుకోవలసినదని చెప్పవచ్చును. మనకు అప్పు ఇచ్చేవారు లేరు. **Recurring deficit** వస్తున్నది. దానిని తగ్గించడానికి పన్నులు వేసుకున్న తరువాత, ఇదిగో పన్నులు వేశారు కాబట్టి గ్రామోద్యోగులకు పెంచాలని చెప్పండి. ఏ రెండుకోట్ల రూపాయలకో అదనపుపన్నులను విధించడానికి అంగీకరించి, అందులో ఏ 30 లక్షలో 40 లక్షలో ఉపాధ్యాయులకు ఇవ్వాలని చెప్పండి— అది నిర్మాణాత్మకమైన సలహా అని అనుకుంటాను. మీదో ఒక సూచన చేయండి. లోటు వస్తోంది; అప్పు చెల్లిస్తున్నాము అని చెప్పినపుడు రేపు సెప్టెంబరులో కొన్ని పన్నులను మంజూరుచేయండి, అక్టోబర్లో చెప్పండి— ఇన్ని పన్నులు వేశాము; గనుక యిందులోనుంచి ఏ 30 లక్షల రూపాయలనైనా ఇచ్చి వారిదుస్థితి బాగుచేయాలని చెప్పండి. ప్రభుత్వం తప్పకుండా ఆలోచిస్తుంది. ఏమీలేకుండా—

శ్రీ పి. సుందరయ్య : ఆంధ్రప్రాంతంలో గత రెండుసంవత్సరాలలోను, అదివరకు 19 కోట్ల రూపాయలు పన్నులునుంచి వసూలుఅవుతుంటే, అది 30 కోట్ల రూపాయలకు పెంచినారు. అదనంగావచ్చిన 11 కోట్లలో గ్రామోద్యోగులకు, ఎన్. జి. ఓ. లకు ఎన్నికోట్లు, లేక ఎన్ని లక్షలు ఇచ్చారో చెప్పగలరా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి : ఆరురూపాయల హెచ్చింపు క్రింద కొన్నిలక్షలు ఇచ్చినాము అనుకోండి. బహుశః ఒకకోటిరూపాయలు అవుతుందేమో. లెక్కలు

ఇంకా తెలియాలి. అయినా natural growth క్రింద కొంత వస్తుంది. అందరికీ సంతోషమే. 19 కోట్ల రూపాయిలు ఈనాడు 30 కోట్ల రూపాయిలైనదంటే ఖర్చులుకూడా ఎక్కువైనాయి. ఎందుకు ఐనాయో చూడండి. జాతీయ వికాస కార్యక్రమాలకు, విద్యకు, ఆరోగ్యానికి, వైద్యమునకు ఈ 3, 4 ఏండ్లలో సంవత్సరం సంవత్సరమునకు ప్రతి Head క్రింద ఎంత ఎక్కువ ఖర్చవుతుందో చూడండి. హరిజనుల విషయమై తరువాత చెబుతాను. లెక్కలో డబ్బు తగ్గించారని వారు షికాయత్ చేస్తున్నారు. తరువాత చెబుతాను, అన్ని Heads క్రింద పని జరుగుతున్నది, జరిగిన వానిని గుర్తించండి. అభినందించండి. జరగని దానిని చెప్పండి. అంతేకాని మాకు జరగడంలేదు. అంతా దుబారాయే, P.W.D. దుబారా; విద్యుచ్ఛక్తి దుబారా; ప్లానింగ్ దుబారా అని చెప్పిన తరువాత పని చేసేవారికి, పని చేయించేవారికి ఉత్సాహం లేకుండా పోతుంది. కేవలం నిరుత్సాహం మాత్రమే మిగులుతుంది. మన ఉద్యోగస్థులందరు దుర్మార్గులనుకుని ప్రయోజనం లేదు. వారి విశ్వాసం చూరగొని వారి దగ్గరనుంచి పని తీసుకోవాలి. అంతేకాని ఉద్యోగస్థులు పనికిరారు; అనధికారులు పనికి వస్తారు; ప్రజలు ఎన్నుకున్నవారు పనికి వస్తారు; వారు పనికిరారు; వీరు పనికి వస్తారు అని చెప్పడం సరియైనది కాదు. ఈ విషయంలో కొంత వాస్తవికమైన దృక్పథాన్ని అలవర్చుకోవాలి. ఈనాడు ఒకరు అధికారంలో ఉన్నారు, మరొకరు లేరుఅనే విషయం ముఖ్యంకాదు. అంతకంటె దేశంలోని ప్రజల సౌభాగ్యం, శ్రేయస్సు ముఖ్యమైన విషయం. ఇందులో ఎలాంటి సందేహం లేదు. పార్టీదృక్పథాలతో వారు ప్రజలకు సేవ చేయడానికే ప్రయత్నిస్తున్నారు. పని చేసేవారికి ఉన్న కష్టాలు కొన్ని ఉన్నాయి. కేవలం కాంగ్రెసు ప్రభుత్వాలకే కాదు; కాంగ్రెసేతర ప్రభుత్వాలకు కూడా కష్టాలున్నాయి. అక్కడ విమర్శలు వస్తుంటాయి. కాబట్టి కొంచెం సానుభూతితో చూడండి, ఎవరికి ఏమి చేయలేక పోయినా సానుభూతి లేకకాదు. మొదట చెప్పినట్లు, ఇక్కడ వారికి ఇవ్వలేక పోతున్నాము. ఏ ఉద్యోగుల సంఘానికైనా I.C.S. ఉద్యోగుల సంఘానికైనా సరే ప్రభుత్వం recognition ఇవ్వవలసి ఉంటుంది. అందులో ఏమిటి షరతు? ఏ పరిస్థితులలోనైనా సమ్మె చేయమని షరతు ఉన్నది; "చెప్పుకుంటాము; deputations తీసుకువస్తాము; పదేపదే రాయబారాలు చేస్తాము; సమ్మె చేయము, We are all loyal servants of Government" అని ఉన్నది.

I.C.S. వారినిగురించి కూడా చెప్పవలసివుంది. అటువంటి పరిస్థితులలో గ్రామ ఉద్యోగులు మా దగ్గర రికగ్నిషన్ పొంది, మేము జమాబందికి రావటంలేదంటే అర్థం ఏమిటి? వారే బెదిరిస్తున్నారా లేక గవర్నమెంటే బెదిరిస్తోందా ఆలోచించండి. ఒకవేళ గవర్నమెంటు బెదిరించినా వట్టి గాలిలో పోయే మాటలతో బెదిరిస్తారు కాని, వారు కార్యరూపేణా, గవర్నమెంటును

స్తంభింపచేయవలెనని, 'మా అధికారాలు మన్నించలేదు కాబట్టి, మాకు 6-0-0 ఎక్కువ చేయలేదు కాబట్టి, మేము గవర్నమెంటును ప్రతిష్ఠంభన చేస్తాం, పారలైజ్ చేస్తాం' అనే భావంగా వారు బెదిరిస్తున్నారు. ఈనాడు teachers కు కూడా ఎక్కువ జీతాలు చేయవలసిందే. మద్రాసులో చేశారు. మేము చేయటానికి ప్రయత్నం చేశాం, కేంద్ర గవర్నమెంటునుండి ఏమైనా సహాయంవస్తే చేద్దామనే ప్రయత్నంలో వున్నాము. వారికి కావలసినవాటిని వారు ఎడ్యుకేషనల్ మినిస్టరుగారికి కాని, Chief Minister గారికి కాని చెప్పవచ్చు. కాని అదే ప్రచారముగా స్కూలులో చదువుసంధ్యలు లేకుండ "అక్కడ మంత్రిగారు ఏమి చెబుతున్నారు? ఇక్కడ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఏమి చెబుతున్నారు?" అనే విషయాలగురించి ప్రచారంచేస్తూ, వారి కాలాన్ని వారి శక్తిని వినియోగిస్తూ, వారిబాధ్యతను సరిగా నిర్వహించటంలేదేమోననిపిస్తుంది. ఏ ఎడ్యుకేషనల్ మినిస్టరైనా, ఏ D.P.I. అయినా ఏమి చేస్తారో మీరే చెప్పండి. మాకు శక్తివున్నప్పుడు తప్పకుండా ఇస్తాము. అంతవరకు మీరు నిదానించండి' అని ప్రభుత్వం వారికి చెప్పినా, వారు అదే విషయంగురించి ఆలోచిస్తూ సరైనమార్గంలో విద్యాబోధన చేయలేకుండా వున్నారు.

నెల్లూరులో ఎయిడెడ్ స్కూల్సును తీసుకొన్నాము. వెంకటేశ్వర్లుగారు, యింకా ఇతరులు సంతోషించారు. అన్నిచోట్లా తీసుకోవాలని చెప్పారు. ఈనాడు ఎయిడెడ్ స్కూల్స్‌లో సక్రమంగా పని జరగటంలేదు అని కొందరు చెప్పారు. ప్రయత్నంచేశాము. కొంత హెచ్చు ఖర్చైనా మంచివుంది. Teachers తమ బాధ్యతను సక్రమంగా నిర్వహించి, పాఠాలు సరిగాచెప్పి, విద్యార్థులకు సరైన తర్ఫీదు ఇచ్చి, ఎంత జీతం కావాలని కోరినా, ఎన్ని కాన్ఫరెన్సులు పెట్టుకొన్నా ఉచితంగా వుంటుంది.

శ్రీ పి. సుందరయ్య : సంవత్సరాల తరబడి కడుపుకాలుతుంటే చదువు చెప్పటం సాధ్యం అవుతుందా ?

డాక్టరు బి. గోపాలరెడ్డి : అది వేదికమీద చెప్పటానికి సరైన నినాదంగా వుంటుంది. కడుపు కాలుతున్నప్పుడు భగవంతు డెక్కడ ? बिना भोजन, भगवान कहाँ हैं? అని ఉపన్యాసాల మధ్య చెబుతూవుంటాము. డెఫిసిట్‌లో వున్నప్పుడు, అప్పిచ్చేవారు లేనప్పుడు, రిజర్వు బ్యాంకువారు నిరాకరిస్తున్నప్పుడు, Government of India వారు ఇవ్వనప్పుడు, మనం ఏమిచేయాలి ? ఈ కడుపుమంట ఎవరు తీరుస్తారో ఆలోచించండి.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : వారు చదువు సరిగా చెప్పటంలేదనా వారి జీతాలు పెంచనిది ?

డాక్టరు బి. గోపాలరెడ్డి : జీతాల విషయం వేరు. జీతాల విషయంలో ధనాభావంవల్ల పెరుగుదల జరగటంలేదని చెబుతున్నాను. పట్టాభిరామారావు గారు ఇట్లా చెబుతున్నారు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఇట్లా చెబుతున్నారనే విషయాలపై కాలం వినియోగించుకోకుండా నెలకొకసారో, రెండునెలల కొకసారో, ఏ కాన్ఫరెన్సులోనో చెప్పుకోవచ్చు కాని, ఉదయంనుండి సాయంత్రం వరకు ఇదే విషయాన్ని ఆలోచిస్తే వారేమి పని చేయగలుగుతారు ? వారే కాదు Government servants అయినా N. G. O. లు అయినా ఆ మాదిరిగా చేయటం న్యాయంకాదు. సెప్టెంబరులో ఏమైనా చేస్తామేమో ? అక్టోబరులో ఏమైనా ఇస్తామేమో ? మేము చెప్పే సలహాలను తృణీకరించారు. నిరాకరించారు. కమిటీని వేయమన్నారు. "ఎందుకు ఈ తాటస్థ్యము, ఈ ఉదాసీనత ?" అన్నారు. ఈ విషయం రావినారాయణరెడ్డిగారు, సుందరయ్యగారు ఆలోచించవలెను. సోషలిస్టు పార్టీవారు కూడా అంతే. వారివారి పార్టీ దృక్పథాలనుబట్టి వారికి కొన్ని ఆశయాలు వుంటాయి. అన్ని పార్టీలకు వుంటాయి. వారి ఆశయంప్రకారం వారుచెప్పింది మేము ఎందుకు వినాలి ? అప్పుడు వారే పరిపాలన చేసుకోవచ్చు. ఫలానావారిమీద tax వేయండని వారు చెబుతారు. దాని సాధకబాధకాలు మేము ఆలోచించవలసివుంది. ఇవన్నీ సమన్వయం చేసుకొని, రాజకీయదృక్పథంతో ఆలోచించాలి. కాని 'సుందరయ్యగారు ఒక సజెషన్ ఇచ్చారు. మేము దానిని ఆమోదిస్తున్నామని ' చెప్పటం అంత సులభమయిన విషయంకాదు. మేము చెప్పే విషయాలు వారు ఆలోచించలేరు. వారి వారి రాజకీయదృక్పథాలబట్టి వారు ఆలోచిస్తారు. ప్రజలందరు మామీద విశ్వాసం వుంచి బాధ్యతతో ఇక్కడ వుంచినారు. వారికి కొంత బాధ్యతవుంది. వారంతరి దృక్పథాలనుబట్టి ఆలోచించవలసివుంది. కన్‌స్ట్రక్టివ్ సజెషన్ అని వారు అనుకొన్నది మేము అవలంబించాలని...

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : వారు అడిగినారు కనుక మేము చెప్పినాము.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : మేము అడుగుతాము. వారు చెబుతారు. మాకు నిరాకరించటానికి అర్హతవుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : నిరాకరించటానికేనా అడిగింది ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి : మమ్మల్ని అడగటం ఎందుకు ? మళ్ళీ నిరాకరించటం ఎందుకు అని అనుకోనక్కరలేదు. అందరు ఒకే అభిప్రాయంలో వుండాలని లేదు. వారి వారి దృక్పథాలబట్టి చెబుతూవుంటారు. బాధ్యతకలిగి, మెజారిటిగల పార్టీలోని పరిపాలన చేస్తున్నవారు ఆ విషయాలు ఆలోచించవలసి వుంది. కమిటీ వేయకూడదా ? కమీషన్‌ను వేయకూడదా అంటారు. మొన్న

మొన్న నే **Taxation Euquiry Committee** వచ్చింది. ఏమిచేయాలో వారు చెప్పారు. వాటిలో కొన్ని కాకుంటే కొన్నయినా అమలులో పెట్టాలి. అవలంబిస్తే సలహాలు చాలా వున్నాయి. ప్రభుత్వానికి సలహాల కొరతలేదు. "ఇంకొక కమిటీని వేస్తానుని ముఖ్యమంత్రిగారు చెప్పలేమి" అనటం న్యాయం కాదు. కొన్ని వున్నాయి. వాటిలో కొన్నిఅయినా మనం చేసుకో గల్గితే సంతోషము. అప్పుడు ఆర్థికపుష్టి వస్తుంది.

ఈనాడు గవర్న మెంటుకు నిశ్చితమైన ప్రణాళిక లేదని, ఒక కార్యక్రమం లేదని శ్రీ రామమూర్తిగారు చెప్పారు. వారి ఉపన్యాసములో రామాయణం గురించి చెప్పారు. చాలా సంతోషం. రమ్యమైనశైలిలో వాక్చాతుర్యంతో మాట్లాడుతూ ఎప్పుడూ రామాయణ ప్రసక్తి తీసుకువస్తూవుంటారు. సంతోషం. కాని ఈనాడు ప్రణాళికలు కావాలి. కేవలం ఉత్తేజపర్చేదిగా వుండాలా? సంతృప్తిపరిచే మాటలు కావాలా? పనులు కావాలా? ఈ విషయాలను గురించి అనుకొన్నప్పుడు **Second Five Year Plan** కన్నా మేము చెప్పగల్గింది ఏమిలేదు. పదే పదే మా పాలసీ, మా సిద్ధాంతాలు చెప్పవలసిన అవసరంలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికను మనం ఆమోదించుకొన్నాము. ౕ సం॥ లలో దానిని నిర్వహించటానికి కావలసిన స్థోమతును సేకరించుకోవలసివుంది. అనేక ప్రాజెక్టులు, అనేక స్కూళ్ళు రెండవ పంచవర్ష ప్రణాళికలో వున్నాయి. సొమ్మును సేకరించుకోవటమే మనము చేయవలసిన కృషి. ప్లాను వుంది, ప్లాను ప్రకారంగా జరుగుతుంది. అందని విషయాలు కూడా అందుకోటానికి ప్రయత్నంచేస్తున్నాము. ఈనాడు మనకు కావలసిన ద్రవ్యంలేదు. దానిని సేకరించుకొని ద్వితీయ పంచవర్ష ప్రణాళికను నిర్విఘ్నంగా కొనసాగించాలి. ప్రతిబంధకాలు, విమర్శలుచేయుటం ఉచితమైన విషయంకాదు. ఎన్నిత్యాగాలు చేసైనా, ఎంత శక్తియినా ధారపోసి ద్రవ్యం పోగుచేసుకొని ద్వితీయ పంచవర్ష ప్రణాళికను నిర్విఘ్నంగాకొనసాగించడమే కాంగ్రెస్‌పార్టీఆశయం. అంతకన్నా ఎక్కువ చెప్పలేము. అంతకన్నా ఎక్కువదూరం పరిగెత్తలేకపోతున్నాం. దానికి మీ సానుభూతి చూపండి. లేదా నిందయినా చేయండి. మా స్థితి మాత్రం అదే—

శ్రీ రామమూర్తిగారు ఏదో సోషలిజమ్ అన్నారు, Socialistic pattern అన్నారు. ఈమాదిరిగా అంటూఉంటే ఏమీలాభము లేదు. అదేమాదిరిగా మేము వారినికూడా అనవచ్చును. దానివల్ల వారికి లాభములేదు. మాకులాభములేదు. శ్రీ రామమూర్తిగారు వారియొక్క మొట్టమొదటి ఉపన్యాసములోనే ఏదో స్వరాజ్యమువస్తూండగానే యిదిఅంతా క్షీరసాగరమథనము అయినతరువాత హాలాహలమువస్తుందని, హాలహలము తరువాత మోహిని వస్తుందని, మోహిని

వచ్చినతరువాత అమృతమువస్తుందని కాంగ్రెసువారు ఊహలు కంటున్నారు. అసలు యీ కాంగ్రెసు ప్రభుత్వమే ఒక హాలాహలము అని అన్నారు. సరే మేము హాలాహలము అయితే, వారు అమృతమా ? పోనీ, ఆ అమృతము అందరికీ పంచిపెట్టేటప్పుడు మాకుకూడ కొంచెము పంచిపెట్టుతారా? కేవలము ఆ మోహినిమాదిరిగ కొంతమంది ఎడల పక్షపాతము, కొంతమందిఎడల అది లేకుండా చేస్తారా ?

శ్రీ బి. శ్రీరామమూర్తి : అమృతము అన్నది కాంగ్రెసు ప్రభుత్వము నుంచే వస్తుందని ఆశిస్తే, అది లేకపోయిందని నేను మనవిచేశాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి : కాని శ్రీరామమూర్తిగారికి యీనాడు ఢిల్లీలో వున్న కేంద్రప్రభుత్వము క్రిందఉన్న ప్రభుత్వాలు అన్నీకూడ హాలాహలముగ కన్పిస్తున్నవి. ఈ హాలహలముఅంతా మ్రింగటానికివారు నీలకంఠుడుగా అవతరించటానికి పూనుకున్నారేమో ! ఏమైనప్పటికినీ, సంతోషమే. కేవలం దీనిని హాలహలము అనవచ్చు. కాలకూటము అనవచ్చును. లేకపోతే యింకో విష సర్పం అనవచ్చును. ఏమైనప్పటికినీ యీనాడు కొంతపని జరిగిందని, కొంత జరుగుతుందని, యింతకుముందు చైతన్యము లేకుండఉండి, ప్రజలు కొంత వరకు నిద్రమేలుకున్నారని, వాళ్ళయొక్క కోరికలన్నీ కోరుతున్నారని అనుకుంటున్నాము. అదిఅంతా మనకుఉంట్టే సంతోషము. దానివల్ల దేశము ముందుకు పోతున్నదికాని, వెనుకకు పోవడములేదనే అభిప్రాయముకూడ మనకు కలుగుతున్నది. మనకు స్వరాజ్యము వచ్చి యిప్పటికి సుమారు 10 సం॥లు అయింది. అది వచ్చిన తరువాత యీ హాలాహల వాతావరణములోనే కొంతపని జరిగిందని సగర్వంగా నేనేకాదు, కేవలం అమెరికా నుంచి వచ్చినవారేకాదు, రష్యానుంచి వచ్చినవారుకూడ, యీదేశంలో యీ పది సం॥ల లోపల కొంతవరకు improvement జరిగిందని అందరుచెబుతున్నప్పుడు మనము మాత్రము కళ్ళుమూసుకుని, ఏమీజరగలేదు, జరగటానికి వీలులేదు, కేవలము ఇదిఅంతా హాలాహలముగా ఉన్నదని, మనము కళ్లు మూసుకుని ఆవిధముగ చెప్పడము న్యాయము కాదేమోనని నేను విన్నవిస్తున్నాను. అది ప్రజలుకూడ హర్షించరేమోనని అంటున్నాను.

శ్రీ బి. శ్రీరామమూర్తి : మమ్ములనుగురించి ప్రజలు ఏమిఅనుకుంటారో ముందుపుట్టబోయేబిడ్డ గుడ్డిదిఅవుతుందో, కుంటిదిఅవుతుందో, అని దానిని గురించి ఆలోచనచేయకండి. మావద్ద హాలహలముఉన్నదో, అమృతముఉన్నదో యిప్పుడు ఎవరుచెప్పలేరు. చూడలేరు. కాని కాంగ్రెసువారివద్ద హాలాహలము ఉన్నదో, మరేమిఉన్నదోగాని, యిప్పుడుఉన్నదిమాత్రము హాలాహల ప్రమేయముగానే ఉన్నదని మనవిచేస్తున్నాను.

*Mr. Speaker* : Let not the hon. Member interrupt often. ఏదో జరగనివ్వండి. మీరుఅన్నదానికి వారుఊరుకున్నారు. వారు అన్నదానికి మీరు ఊరుకోండి. అదిబాగాఉంటుంది. కుంభకర్ణుడు అని వారు అన్నారు. హాలాహలముఅని మీరుఅన్నారు. అదిఅంతటితో సరిపోయింది. Let the speech go on. The hon. Member should not interrupt the speech in the middle.

డాక్టరు బి. గోపాలరెడ్డి : తరువాత శ్రీ రావి నారాయణరెడ్డిగారు మాట్లాడుతూ, మేము అనేక సలహాలు చెప్పాము, పెద్ద పెద్ద ఉద్యోగస్థుల జీతాలు తగ్గించండి, రాజప్రముఖులకు యిచ్చే allowances అన్నీ తీసివేస్తే అందులోనుంచి కొన్ని లక్షలు ప్రభుత్వానికి మిగులుతుంది, గవర్నరుగారిక్రింద అయ్యే ఎనిమిదికోట్ల రూపాయలు తగ్గించండి, austerity drive చేయండి, దానివల్ల కొన్ని లక్షలు మిగులుతుంది. ఇంకను tobacco వ్యాపారము nationalise చేయండి, దానివల్ల విదేశాలవారు తీసుకుని పొయ్యే డబ్బు అంతా మనకే వుంటుంది. మహారాజులందరినీ tax చేయండి, దానివల్ల కొంత ఆదాయము వస్తుంది, అని అవి అన్నీ చెబితే మీరు పాటించడములేదు" అని అన్నారు. మేము నిజానికి మన రాష్ట్రానికి కేంద్రప్రభుత్వంనుంచి ఎంతరావాలో అంతా సాధ్యమైనంతవరకు వారిని అడిగి తెస్తూనే ఉన్నాము. అట్లాకాదు, యింకా వత్తిడి చేయండి. కాకపోతే పెద్ద ఆందోళన చేయండి, చేస్తే వస్తుంది అన్నారు. సుందరయ్యగారుకూడ యీ విషయము గురించి కొంత ఉద్రేకముగానే చెప్పారు. కేంద్ర ప్రభుత్వంనుంచి వీలు అయినంత సొమ్మురాబట్టటానికి మేముకూడ సర్వవిధముల ప్రయత్నిస్తూనే ఉన్నాము. అంతేగాని కేవలము బెదరింపులతోను, అదరింపులతోనూ జరిగేవిషయము కాదు, ఇది. అడిగే దానిలోకూడ సామరస్య పూర్వకముగనే, ఏవిధముగ చెప్పవలెనో, ఆవిధముగా చెప్పవలసియున్నది. అది Finance Commission ద్వారా కానివ్వండి, లేకపోతే కేంద్రప్రభుత్వము మంత్రులు యిక్కడికి వచ్చినప్పుడు కానివ్వండి, లేకపోతే మన Prime Minister గారు వచ్చినప్పుడు, ఏదో విధముగ వారికి మన అవసరాలు తెలియజేసి, వారియొక్క సహాయము పొందటానికి ఎట్లా వీలు అవుతుందో, ఆ విధముగా మనము సంపాదించుకుంటే మంచిది గాని, ఎవరినో పరాయివారిని treat చేసినట్లుగా వారిని treat చేసి ఏదో village officers ను treat చేసినట్లు చులకనగా treat చేస్తూ, అలాటి వైఖరిని మనం కేంద్ర ప్రభుత్వం ఎడల చూపించేటట్లయితే, మనము వారియొక్క అనురాగము పొందలేము. అంతేగాని, మీరు మేము కోరినంత డబ్బు యివ్వకపోతే మేము strikeచేస్తాము, లేకపోతే సత్యాగ్రహము చేస్తాము, లేకపోతే రాజేంద్రప్రసాదుగారు యిక్కడికి వచ్చినప్పుడు వారిని బహిష్కరిస్తాము అని, యీ మాదిరిగ చెబితే, మంచిది

కాదు. ఆ విధముగచేస్తే, మనకు ప్రపంచలో మర్యాద అనేది ఉండదు. అందు వల్ల మనకు వచ్చే సహాయము కాస్త పోగొట్టుకున్న వాళ్లము అవుతాము. దాని వల్ల ప్రయోజనములేదు. ఇంతకుముందు అనేక విషయములలోకూడ చెప్పారు. మనకు National Development Committe లలో ఈ విషయము వచ్చింది. Regional Development ఏమీ సక్రమంగ జరగడములేదని అన్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యీ public sector లో ఎన్ని కోట్లు వచ్చింది ? లేక పోతే దక్షిణాది వారికి ఎంత వచ్చింది ? లేకపోతే దక్షిణాది వారికంటే ఆంధ్రకు ఎంతవచ్చింది ? ఇలాంటి విషయాలన్నీ వచ్చినప్పుడు, మనము లెక్కలు తీసుకుని పరిశీలిస్తే, మనము నిరాశ చెందవచ్చు. అటువంటప్పుడు మనము వారితో చెప్పవలసిన విధముగ చెబుతూనే ఉన్నాము ఇందులో అప్రమత్తత ఏమీ లేదు. మనకు ఏవిధముగాను అన్యాయము జరగకుండానే మేము ప్రయత్నిస్తున్నాము. అంతకంటే, మేము చేయలేదని అనడం న్యాయముకాదు. లేక పోతే మేము ఏమి చేయాలనో చెప్పండి. "మీరుయివ్వలేదు గనుక మేము రాజీనామా పెట్టుతామని కూర్చోడమో, లేకపోతే పాలన గవర్నరుగారి స్వాధీనం చేసుకోండి, లేకపోతే, మాకు డబ్బుఉన్నా లేకపోయినా మా N. G. O. లకు, మా Village Officers కు, మా teachers కు మేము యిస్తున్నాము. డబ్బు లేకపోతే తరువాత చూచుకోవచ్చును" అని చెప్పటానికి వీలులేదు. ఇందులో Reserve Bank కు కొన్ని నియమములు ఉన్నవి. రాష్ట్ర ప్రభుత్వానికి కూడ కొన్ని నియమములు ఉన్నవి. ఆ నియమములు పాటిస్తూ పని చేయవలసి యున్నది. అంతేగాని యీనాడు మనకు గవర్నరుగారి ఖర్చు ఎందుకు అన్నారు. కేవలము మనకు శక్తి లేనటువంటి విషయాలు, లేకపోతే Constitution కు విరుద్ధముగ ఉండే విషయాలు, మనము కోరితే ప్రయోజనము లేదు. ఆనాడు ప్రభుత్వము కొన్ని agreements ను బట్టి యీ సంస్థానాధీశ్వరు లందరు, కేంద్ర ప్రభుత్వము యిచ్చిన సలహాలను పాటించి Indian Union లో చేరినారు. అప్పుడు వారుకూడ సహాకరించారు. మొట్ట మొదట ఎక్కడనో ఒకరో యిద్దరో తప్ప అందరు మొత్తముమీద ఆరు వందల మంది సంస్థానాధీశ్వరులు కేంద్ర ప్రభుత్వము వారి సలహాల వల్లనే Indian Union లో చేరటానికి ఒప్పుకుని వాళ్లకు ఉన్నటువంటి, సంస్థానాలు, ఆస్తులతో సహా సర్వం ప్రభుత్వానికి స్వాధీన పరిచారు. అందుకు నేను వారినందరినీ అభినందిస్తున్నాను. వారు మన దేశమునకు చేసిన ద్రోహము ఏమీ నాకు కన బడడము లేదు. మన దేశానికి వారు అపకారం చేసినట్లు నేను అనుకోవడము లేదు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : అయితే, పోలీసు యాక్షను తరువాత చేరిన వారెవ్వరో మంత్రిగారికి తెలుసును అనుకుంటాను.

డాక్టరు బి.గోపాలరెడ్డి : ఎక్కడో కొందరు ఉంటే ఉండవచ్చు. వారందరు మొత్తముమీద 600 మంది వుంటారు. వారు హృదయపూర్వకముగా, సంతోషపూర్వకముగా **death warrants** వ్రాసుకున్నారు. అవికూడ యిప్పుడు ఉన్న మహారాజులు అందరు చనిపోయిన తరువాత వారి కుమాళ్ళకు తగ్గిస్తామని కేంద్రప్రభుత్వమువారే చెప్పారు. అటువంటి సందర్భములో వారికి ఇచ్చే మొత్తాలు తగ్గిస్తే, ఏదో ప్రభుత్వానికి వస్తుందని, అది ప్రచారముకొరకు కావలసివుంటే చెప్పుకోమనండి. చెప్పుకోవచ్చు. ఈనాడు హైదరాబాదు నవాబుగారికి 25 లక్షల రూపాయలు ఇస్తున్నారు. దానినికాస్తా ఎగనామము పెట్టితే, మనకు ఆ 25 లక్షలు మిగులుతుంది, దానివల్ల మన బడ్జెటులోటు పూర్తి అవుతుంది అని చెబితే చెప్పవచ్చుగాని, ఆనాడు కేంద్రప్రభుత్వములోని పెద్దలు వారికిచ్చిన సలహాలవల్ల వారు **Indian Union** లో చేరేటప్పుడు వారికి ఇచ్చిన వాగ్దానాలు అంతసులభముగా కాగితపుముక్కలు మాదిరిగా తీసివేయటానికి వీలులేదు. అది తీసివేస్తే పైవారివద్ద మనకు ఏమైనా విలువ వుంటుందేమో ఆలోచించుకోవలసి యున్నది. కాబట్టి దానివల్ల ఎక్కువగ వచ్చే ప్రయోజనము ఏమీలేదు. ఈ **integration of all States** అనేది ఒక **event**గా ఉండడమువల్ల మనము వారికి పదిసంవత్సరాలలో యిచ్చే సొమ్ము ఏ మూడు నాలుగు కోట్లో అయితే, అది యివ్వకుండ ఉండవలెనని అనుకుంటే, ఆ 3, 4 కోట్ల రూపాయలు యీ ప్రభుత్వానికి ఏమంత అమూల్యమైన విషయము కాదు. కాని మనము చేసిన వాగ్దానాలను మనము భంగముచేసి, దానివల్ల మనము కొంతలాభము సంపాదించాలని ఉద్దేశించడము న్యాయము, ధర్మము కాదని నేను అనుకుంటున్నాను.

అట్లాగే గవర్నరుయొక్క విషయము వున్నది. తరువాత ప్రభుత్వంలో దుబారా జాస్తిగా ఉన్నదని అన్నారు. దుబారా జరగడము ఏ మంత్రులకుగాని, ఏ ప్రభుత్వానికిగాని యిష్టము ఉండదు. ఈ దుబారాను తగ్గించడానికి ఎక్కడెక్కడ వీలు అవుతుందో పరిశీలించటానికి ప్రభుత్వమే ఒక కమిటీని వేసింది. అందులో **officials, non-officials**, అందరు కలసి, ఒక కమిటీగా విచారించబోతున్నారు. అందులోకూడ అది చిన్న కమిటీగా ఉంటే బాగా ఉంటుందనే విషయముగూడ విచారించాము. ఆ విషయములో యింకా ఏమైనా వివరాలు సూచనలు ఉంటే, డిపార్టుమెంటుకు పంపించండి. అవి అన్నీ వారు ఆలోచిస్తారు. ఈ విషయములో సభ్యులు యిచ్చిన సూచనలు ఏమైనా వుంటే, అవి అన్నీ ప్రభుత్వము పాటించకుండా **neglect** చేస్తుందని అనుకోనక్కరలేదు. ప్రతి డిపార్టుమెంటును గురించి, సభ్యులు యిచ్చిన ఉపన్యాసాలు సూచనలు అన్నీకూడ డిపార్టుమెంటువారు పరిశీలిస్తారు. సభ్యులు యిచ్చిన సలహాలు తప్పకుండ **examine** చేస్తారు. 'ఫలనా మెంబరు యీ మాదిరి సలహా

యిచ్చాడు. What about this?' అని, అందులోని సాధకబాధకాలు అన్నీకూడ examine చేస్తారు. అంతేకాని, అవి అన్ని neglect చేస్తారని, ignore చేస్తారని ఆగ్రహపడనక్కరలేదు. కాబట్టి సభ్యులుచెప్పిన ప్రతి చిన్నవిషయము దగ్గర నుంచి పరిశీలన జరుగుతుంది. ఇక్కడ సభ్యులు చెప్పిన విషయాలు అన్నింటికి నేను జవాబు యివ్వలేదని అనుకోనక్కరలేదు. కొన్నికొన్ని examine చేసినవి ఉంటాయి. కొన్నికొన్ని చేస్తూవుంటారు. కొన్నికొన్ని చేయవలసినవివుంటాయి. కనుక అవి అన్నీ examine చేయవలసి వుంటుంది.

ఇక హరిజనుల విషయములో వారికి గత సంవత్సరముకంటే, యీ సంవత్సరము allotment తగ్గించారని అన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో 1957-58 కి 81 లక్షలు హరిజనోద్ధరణకొరకు కేటాయించవలసిందిగా నిర్ణయించాము. మనకు యీ సం॥ము బడ్జటులోటు ఎంత వున్నప్పటికిన్నీ, ప్రభుత్వానికి ఎన్ని యిబ్బందులు, ఎంత ఎక్కువ ధనాభావము వున్నను, హరిజనుల విషయములో మాత్రము అలాంటి ధనాభావము వారికి లేకుండా యిస్తూనే వున్నాము. వారికి బావులు కావాలన్నా, హాస్టల్సు కావాలన్నా, నివేశన స్థలములు కావాలన్నా, గృహములు కట్టుకోవాలన్నా చేస్తున్నాము. పోయిన సం॥ము కంటే యీ సం॥ కొంచెము తగ్గినదనుకోండి. ఈ విషయములో కేంద్ర ప్రభుత్వము వారు యింకను మంజూరు చేయవలసిన స్కీములు కొన్ని ఉన్నవి. అవి మంజూరు చేసినట్లుగా తెలియగానే దానిక్రింద, గత సంవత్సరం యిచ్చిన దానికంటే తక్కువలేకుండానే యివ్వటానికి ప్రయత్నిస్తాము. గత సంవత్సరం ఆంధ్రలో 75 లక్షల రూపాయలు, తెంగాణాలో 11 లక్షల రు. లు ఖర్చు అవుతుందని Revised Estimates ప్రకారము అనుకున్నారు. ఈ సంవత్సరము కూడ 69 లక్షలు ఆంధ్రలోనూ, 12 లక్షలు తెలంగాణలోనూ బడ్జటు estimates లో ఉన్నది. కాని 5. 49 లక్షలు పోయిన సం॥ కంటేకూడ యీ సం॥ తక్కువ వున్నది. దీనికి కారణము ఏమిటంటే కేంద్ర ప్రభుత్వమువారివి Health Schemes వగైరాలు, Centrally Sponsored schemes కనుక, అది వారే మంజూరు చేయవలసియున్నది. అవి శాంక్షను అవుతూవుండగానే వాటికి కావలసినడబ్బు అంతాకూడా ప్రభుత్వము మంజూరుచేస్తుంది. కాని ప్రభుత్వానికి మాత్రము ఎన్ని యిబ్బందులు ఉన్నప్పటికినీ, హరిజనుల విషయములోమటుకు ఏవిధముగాను లోపము చేయడముగాని, miserliness చూపించడముగాని ఏమీలేదు.

ఇంకా ఎక్కువచేస్తే బాగుంటుందనే విషయం వాకు తెలుసును. ఇంకా అనేక మంది హరిజన బాలబాలికలకు చదువు చెప్పిస్తే బాగుంటుందని, లేక వాళ్ళ కుటుంబాలకు గృహనివేశాలు కల్పిస్తే బాగుంటుందని, మనం అను

కొన్నాము. కాని ఈ నాటి పరిస్థితులవల్ల అవి చేయలేకపోతున్నాము. హరిజన సోదరులకు ఎలాటి సందేహాలు ఉండనక్కరలేదు. వారు కోరినట్లు 3 కోట్ల రూపాయలు ఇవ్వలేక పోయినప్పటికినీ వారివిషయంలో సానుభూతి పూర్వకంగా చూస్తూ వీలైనంతమట్టుకు Government of India యొక్క సహాయం కూడా తీసుకొని వారికి సహాయం చేయడానికి తప్పకుండా ప్రయత్నం చేస్తాము. 5·49 లక్షల విషయంకూడా Government of India వారికి వ్రాసి, అదికూడా తెప్పించి పోయినసంవత్సరంకన్న ఏమాత్రం తక్కువ లేకుండా చేయడానికికూడా ప్రయత్నం చేస్తాము. అంతలోపలనే వీళ్ళ పరిస్థితి దినదినానికి దిగజారుగా ఉన్నదని అనుకొని వాళ్ళ సందేహాలు వెలిబుచ్చినంత మాత్రాన ఏమి లాభంలేదు. వారివిషయంలో ఎలాటి ఉదాసీనత లేదని నేను చెబుతున్నాను. కాని మొత్తంమీద ఆర్థికఅభావం ఉన్నదనే విషయాన్ని అందరు గుర్తించాలని కోరుతున్నాను. ఒకవేళ విసుగ్గా ఉన్నప్పటికీ పునరుద్ఘాటన చేయకతప్పదు. గ్రామోద్యోగులకు ఇవ్వకపోయినా, teacher లకు ఇవ్వలేకపోయినా, వాళ్ళయందు సానుభూతి లేక కాదు.

ఈ సంవత్సరం 5 కోట్ల రూపాయలు అప్పు వస్తుందేమోనని ఆశించాము. ఆ అప్పుకూడా వచ్చేపరిస్థితిలో లేదు. Market సరిగాలేదు. అందువల్ల అదికూడా విరమించుకొని Small Savings ప్రణాళికలను విస్తృతంగా అమలు చేసుకుందామనే మాదిరిగా అనుకోవలసి వచ్చింది. ఏ August, Septemberల్లోనో ఆ 5 కోట్లు వస్తుందేమోనని అనుకుంటే అది రావడానికి వీలులేకుండా ఉన్నది. దానికి ఎక్కువ drive ఇచ్చి అన్నితాలూకాల ఉద్యోగస్థులు, అనధికారులు అందరుకూడా ప్రయత్నం చేసినాగాని వస్తుందా, లేదా అనే సందేహంకూడా ఏర్పడుతోంది. ఇంతకుముందే నేను ఒక విన్నపం చేశాను. "Small Savings విషయంలో అన్ని పార్టీలవారు సహకరించవలసింది అని ప్రతిజిల్లాకు ఒక కోటా యిచ్చినారు. ప్రతిజిల్లా కలెక్టరుకు నేను స్వయంగా వ్రాశాను. కొంత మంది Board Member లు కూడా దానికి నియమితులైనారు. ఇంకా అనధికారులు అందరూకూడా సహాయంచేసి దుబారాగా ప్రజలు ఖర్చుపెడుతున్న ద్రవ్యాన్ని small savings ద్వారా పొదుపు చేసుకొనేటట్లు చేయాలి. Government పొదుపు కావాలని అంటున్నారు. దానికి వేరేకమిటీని వేశారు. వారు చూస్తారు. ప్రజలలోకూడా పొదుపు కావాలి. ఈ నాడు prices ఎక్కువగా ఉన్నాయి. Prices బాగా వున్నాయి కాబట్టి "వచ్చినడబ్బంతా ఇవ్వాళే ఖర్చుపెట్టుకొందాము రేపు అనేమాట లేకుండా" అనేటటువంటిది కాకుండా రేపుమళ్ళీ ఒకవేళ ఏమిజరిగినప్పటికీ కొంతనిలవ ఉండేటట్లుగా Small Savings లో కూడా వాళ్ళు డబ్బు వేసేటట్లు చేయాలి. ఈ Small Savings ద్వారా వచ్చేటటువంటి ద్రవ్యం అంతా ప్రణాళికలకోసమో, నాగార్జునసాగర్ ప్రాజెక్టు

కోసమూ, లేక మచ్ఖండ్ కోసమో లేక ఇంకా ఇతర plan ల కోసమో వినియోగించుకోడానికి వీలు అవుతుంది. ఆ విషయంలో శ్రీమన సుందరయ్యగారు వారి పార్టీవారు, సోషలిస్టుపార్టీ వారు ఇంకా ఎక్కువసహాయం చేయడానికి ఆస్కారం ఉన్నది. అందరుకూడా small savings విషయంలో సహాయం చేయవలసిందని కోరుతున్నాను.

మామంత్రులుకూడాజిల్లాలకు పోయినపుడు సోషలిస్టుపార్టీ వారు, కమ్యూనిస్టుపార్టీ వారు, Independent పార్టీవారు, కాంగ్రెసుపార్టీ వారు అందరు కూడా వారివారి గ్రామాలలో ఏ మాత్రం సహాయంచేస్తున్నారు? వారివారి గ్రామాలలో ఏమి అవుతున్నది? అని అడగబోతున్నారు. అడిగినపుడు మా పార్టీవారు ఏమి చేయలేదు అనే అపవాదు వారిమీదకురాకుండా చేసుకోవలసిన అవసరం మన అందరిమీద ఉన్నది. ఉద్యోగస్థుల దగ్గరనుంచి అందరు కూడా సహాయంచేసి దాదాపు 9 కోట్ల రూపాయలు వసూలుచేస్తేనే గాని శీవ వంతు grant గా ఆ 5, 6 కోట్ల రూపాయలు రాదు. అది రాకపోయినట్లయితే ఈ సంవత్సరం అనుకొన్నటువంటి plans కొంతవరకు paralize కావలసివస్తుంది. ఎంతమంది ఏమి చెప్పినప్పటికీ మంత్రులచేతులలో మంత్రంలేదు. ద్రవ్యంలేకుంటే ఏ పని జరగదు. అది అప్పుగానో, పన్నుల మూలంగానో, ఏదో ఒకరకంగా వస్తేనేకాని. .........

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు : ఇతర States లో ఇంతంత deficit ఎలా భరిస్తున్నారు? మనం భరించలేకపోవటానికి కారణం ఏమిటి?

డాక్టరు బి. గోపాలరెడ్డి : బెంగాలులోవాళ్లు Revenue account లోనే deficit చూపించారు. వాళ్లు Capital Account మీద కాకుండా రెవెన్యూ account మీదే అంతాకలిపి మాకు ఇంత dificit అని చెపుతారు. మొదటినుంచి అదొక సాంప్రదాయం వారిది. అన్ని రాష్ట్రాల budgets వచ్చినాయి. అవన్నీ examine చేసి వాళ్లు ఎట్లా భరించబోతున్నారో చూచుకోవచ్చు. మొత్తంమీద వాళ్లు ఎట్లా భరిస్తున్నారనే తప్ప వాళ్లు ఎంత పన్నులు వేసుకొంటున్నారో చూచుకోవడంలేదు. Bengal కు 'ఇంత' deficit వచ్చింది. ఒరిస్సాకు 15 కోట్ల రూపాయలు deficit ఉన్నది అంటే, 5 కోట్ల రూపాయలు మనకొక డెఫిసిట్ అవుతుందా? అని అనుకొంటే ప్రయోజనంలేదు.

శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు : Incidence of taxation ఎంతో, compare చేశారా?

డాక్టరు బి. గోపాలరెడ్డి : మనకన్న ఇతర ప్రాంతాలలో ఎక్కువగానే ఉన్నది. మద్రాసులో మనకన్న ఎక్కువ ఉన్నది. బొంబాయిలోను, మైసూరు

లోను కూడా ఎక్కువగానే ఉన్నదేమో! 3 కోట్ల చిల్లర మంది మీద ఈ సంవత్సరం 52 కోట్ల రూపాయలు వస్తున్నది. మద్రాసులో మనకన్న తక్కువ జనాభాఉన్నది. వాళ్ళకు 56 కోట్ల రూపాయలువస్తున్నది. **Percapita income** వాళ్ళమీద ఎక్కువ ఉన్నది. **Bombay** లో వాళ్ళ **butget** ఈ సంవత్సరం 109 కోట్ల రూపాయలు. 4 కోట్ల చిల్లరమంది ప్రజలు ఉన్నారు. కాబట్టి ఎక్కడో బెంగాలులో ఇట్లా చేసినారు, ఒరిస్సాలో ఇట్లా చేసినారు అని చెప్పుకోనేదాని కన్న ఏ **Bombay** తోనో, **U. P.** తోనో, **Madras** తోనో పోల్చుకొని ముందుకు పోవడానికి మనంప్రయత్నంచేసుకోవాలి. అసలు పోల్చుకోవడంకూడాఅనవసరం. మనప్రజలకు ఎన్నో సౌకర్యాలు చేయవలసిఉంటే, వాళ్ళందరు కోరుతూఉంటే వాటిని చేయలేక, ద్రవ్యంలేక నిస్సహాయతను ప్రకటించేదానికన్న ద్రవ్యం సంపాదించి వాళ్ళకు సేవ చేయాలని అనుకోవడం మంచిది.

చెంగలరాయ నాయుడుగారు బకాయి బాకీలగురించి చెప్పినారు. "5, 6 సంవత్సరాలది అంతా ఒక్కసారి కట్టమంటున్నారు. వాళ్ళకు చాల అన్యాయం జరుగుతోంది"అని. 5, 6 సంవత్సరాలునిలువ పెట్టుకోవడం వాళ్ళకే అపకారం. ఎప్పటికైనా ప్రభుత్వ ద్రవ్యం చెల్లించవసి ఉంటుంది. ఏదో ఒకటి, రెండు సంవత్సరాలు దయా దాక్షిణ్యాలు చూపించినంత మాత్రాన అసలు మన దగ్గర వసూలు చేయకుండా ఉంటారనే ఉద్దేశంతో వారు ఇవ్వకుండా ఉండటం సమంజసం కాదు. వారు ఇవ్వకుండా ఉన్న దానివల్ల ఇంకొక రైతుకు మేము సహాయం చేయడానికి వీలులేకుండా పోతున్నది. మేము ఇచ్చినటువంటి 1000 రూపాయలు మళ్ళా సకాలంలో ఇస్తూఉంటే ఆ వెయ్యి రూపాయలు ఇంకొక రైతుకు ఇవ్వడానికి వీలు ఉంటుంది. ఆయన ఎన్నో **Petition** లు పెడతూ ఉంటాడు "అయ్యా, మాకు ఇవ్వండి"అని. మాదగ్గర ద్రవ్యం లేకుండా వాళ్ళ దగ్గర నిలవ ఉండిపోయిన దానివల్ల ప్రజలకు చేయవలసినటువంటి సహాయాన్ని చేయలేకుండా పోతున్నామేమోనని కూడా అనిపిస్తూ ఉంటుంది. అందువల్ల బకాయి బాకీలన్నీ వసూలు చేయడం వాళ్ళకు మంచిది. ప్రభుత్వానికి మంచిది. ఇతర రైతులకు కూడా మంచిది. అవన్నీ వసూలు చేసినప్పుడే ఇతర రైతులకు మేము ఎక్కువ సహాయం చేయడానికి వీలుగా ఉంటుంది. అందువల్ల ఈ విషయంలో అట్టే దాక్షిణ్యం చూపిస్తే ప్రయోజనం లేదు. ప్రభుత్వానికి రావలసినటువంటి ఋణాన్ని ప్రజలు ఎంత శీఘ్రంగా ఇస్తే అంత శీఘ్రంగా ఇతరులకొరకు వినియోగించడానికి వీలుగా ఉంటుంది. కాబట్టి ఆ విషయంలో ఎక్కువ దాక్షిణ్యం చూపిస్తే ప్రభుత్వం నడవదేమోనని కూడా అనుకుంటున్నాను.

ప్రభుత్వము ఎప్పుడూ కొంత ప్రతిష్టమీద నడుస్తూ ఉంటుంది. ఎట్లా అయితే ప్రజలకు ఆశయాలు, వ్యక్తిగతమైన స్వాతంత్ర్యాలు ఉంటాయో

అట్లాగే ప్రభుత్వానికి కూడా ప్రతిష్ట అనేది ఉండవలె. ప్రభుత్వానికి ప్రతిష్ట పోయిన తరువాత ఎంత చెప్పినప్పటికి ప్రయోజనం లేదు. ఈనాడు Telegraph lines, railway lines అన్నికూడా ఏ police వారు, ఏ village officers, protect చేస్తున్నారు ? ప్రభుత్వం యొక్క దర్పంమీద, ప్రతిష్టమీద, కాపుదారి లేక పోయినప్పటికీ ఎవరు కొట్టడంలేదు. ప్రభుత్వానికి ప్రతిష్ట అనేది లేకుండా చేసి ప్రభుత్వాన్ని స్థంభింప చేస్తామని పూనుకొని representation లోనే ఒక agitation తీసుకొచ్చి దానిమీద పెద్ద political agitation, లేక ఒకపెద్ద కమోషన్ తీసుకొస్తామని చెప్పి చేయడం మాత్రం న్యాయంకాదు. ఉద్యోగస్థులు వాళ్ళ వాళ్ళ కష్టాలు చెప్పడం న్యాయమేగాని దానినిఒక పెద్ద Political movement క్రింద తయారుచేసి ప్రభుత్వానికి మర్యాదలేకుండా చేసి, ప్రభుత్వాన్ని స్థంభింప చేస్తామని వాళ్ళు ప్రయత్నం చేయడం ఎవరు, ఏ పార్టీవారు కూడా హర్షించతగదు. ఈనాడు మేము ఉన్నామని వారు ప్రోత్సహిస్తే రేపు ప్రొద్దున వారు ఉన్నారని ఇంకొకరు ప్రోత్సహిస్తారు. దానివల్ల ఎవరికీ లాభంలేదు. ప్రభుత్వం అనేది ఒక continuous body. ఏ పార్టీ వారు వచ్చినప్పటికి కూడా దానికి ఒక మర్యాద ఉండవలెననే భావంగా వారు ఈ ఉద్యోగస్థులకు సలహా చెప్పవలసిందని నేను కోరుతున్నాను. Representation చేయవద్దని నేను చెప్పుటంలేదు. Representation చేయడంలో అదిరింపులు బెదరింపులతో ప్రభుత్వంపట్ల మర్యాద లేకుండా ప్రతిష్టంభన చేస్తామనే భావంగా లేకుండా ఉండవలెను.

అనేకమంది అనేక విషయాలు చెప్పారు. వారివారి నియోజకవర్గాల విషయం చెప్పారు. ప్రజలకు ఎక్కడ ఏమిజరగలేదో చెప్పినారు. చాల సంతోషం. ఇంకా ఎక్కువపని, చురుగ్గా జరగడంలేదనే ఆవేదన ఈనాడు ప్రతి వాళ్ళకు ఉన్నది. 157 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టినప్పటికి కూడా మనం చేయవలసినటువంటి పనులు చాల మిగిలిపోతున్నాయనేటటువంటి విషయం అందరికి తెలుసును. ఈ నాడు మనం ప్రారంభిస్తున్న పనులు 5 సంవత్సరాలలో పూర్తికాకపోవచ్చును. కాని ఈనాడు ప్రజలంతా ముందుకు కదలుతూ ఉన్నారు. త్వరలోనే వాళ్ళు గమ్యస్థానంచేరి సుఖంగా ఉండాలని ఆశిస్తూ, ఈ Appropriation Bill ను ఆమోదించవలసిందని నేను సభ్యులందరిని ప్రార్థిస్తున్నాను.

*Mr. Speaker* : The question is :

"That the Andhra Pradesh Appropriation (No. 2) Bill, be taken into considerarion at once."

**The motion was adopted.**

*Mr. Speaker :* The question is :

"That clause 2 with Schedule stand part of the Bill."

The motion was adopted.

Clause 2 with the Schedule was added to the Bill.

*Mr. Speaker*: The question is :

"That clause 1 stand part of the Bill."

The motion was adopted.

Clause 1 was added to the Bill.

*Mr. Speaker:* The question is:

"That the Preamble stand part of the Bill."

The motion was adopted.

The Preamble was added to the Bill.

*Dr. B. Gopala Reddi :* Mr. Speaker, Sir, I beg to move:

"That the Bill be passed into law."

*Mr. Speaker*: The question is:

"That the Bill be passed into law"

The motion was adopted.

*Sri P. Sundarayya* : I demand a division, Sir.

The House then divided :

Ayes — 110

1. Sri N. Sanjeeva Reddi
2. Sri A. C. Subba Reddi
3. Sri Kallur Subba Rao
4. Sri J. Chandramouli
5. Sri K. Satyanarayana
6. Sri K. Vijayabhaskara Reddi
7. Sri M. Pallam Raju
8. Sri T. Anjaiah
9. Sri P. Anthony Reddi
10. Sri B. Appalaswamy
11. Sri Kammili Appa Rao
12. Sri Appa Rao Shetkher
13. Sri G. Bapaiah
14. Sri Peta Bapaiah
15. Sri E. Basappa
16. Sri Seerla Brahmayya

17. Sri Yadam Chennayya
18. Sri N. Chenchurama Naidu
19. Sri Juvvadi Chokka Rao
20. Sri Dawar Hussain
21. Sri P. Gopalakrishna Reddi
22. Sri T. Gopala Krishniah Gupta
23. Sri P. Gopalu Reddi
24. Sri P. Gunnayya
25. Sri B. V. Guru Murthy
26. Sri D. Hanumantha Rao
27. Sri K. Janardhan Reddi
28. Sri Kashiram
29. Sri K. Keshava Reddi
30. Sri Raja V. V. Krishnam Raju Bahadur
31. Sri D. Kondiah Chowdary
32. Sri J. Kondal Rao.
33. Sri L. Lakshmana Das
34. Sri T. Lakshmi Narayana Reddi
35. Sri M. Lakshmiah
36. Sri M. N. Lakshmi Narasayya
37. Dr. B. Gopala Reddi
38. Sri J. V. Narasinga Rao
39. Sri D. Sanjivayya
40. Sri Koti Reddi
41. Sri A. B. Nageswara Rao
42. Sri Sheik Md. Rahamathullah
43. Sri P. Mahendra Nath
44. Sri Manda Sailu.
45. Sri Muralidhara Reddi
46. Sri Ch. S. R. V. P. Murthy Raju
47. Sri J. B. Mutyal Rao
48. Sri D. Narasayya
49. Sri R. Narasimha Reddi
50. Sri S. Narayanappa
51. Sri R. Nathamuni Reddi
52. Sri S. Padmanaba Reddi
53. Sri G. V. Pithambara Rao
54. Sri M. Potha Raju
55. Sri K. Punnayya
56. Sri Butyi Rajaram
57. Sri M. Rajaram
58. Sri B. Rajayya
59. Sri M. Rajeswara Rao
60. Sri P. V. Rajeswara Rao
61. Sri D. Ramabrahmam

62. Sri T. Ramachandra Reddi
63. Sri N. Ramachandra Reddi
64. Sri V. Rama Rao
65. Sri P. Thimma Reddi
66. Sri S. B. P. Pattabhirama Rao
67. Sri Mehdi Nawaz Jung
68. Sri K. Brahmananda Reddi
69. Sri M. Narasinga Rao
70. Smt. Masuma Begum
71. Smt. Jayalakshmi Devamma
72. Smt. K. Kanuka Ratnamma
73. Smt. B. Rukmini Devi.
74. Smt. T. N. Sada Lakshmi
75. Smt. Shantha Bai
76. Sri Ranga Reddi
77. Sri M. Rangayya
78. Sri A Ratnam
79. Smt. P. Vani Ramana Rao
80. Smt. Shahjehan Begum
81. Sri K. Santhappa
82. Sri Ch. Satyanarayana
83. Sri K. Seetharamaswamy
84. Sri K. Seethiah Gupta
85. Sri N. C. Seshadri
86. Sri Shahabuddin Ahmed Khan
87. Sri Sheik Moula Saheb
88. Sri Sree Ramulu
89. Smt. T. Lakshmi Kanthamma
90. Smt. Sumitra Devi
91. Sri Mir Ahmed Ali Khan
92. Sri Konda Lakshman Bapuji
93. Sri B. Subba Rao
94. Sri Ch. Subbarayudu
95. Sri Raja Sagi Suryanarayana Raju
96. Sri S. Ranganatha Mudaliar
97. Sri C. V. Suryanarayana Raju
98. Sri Vasudev Krishnaji Naik
99. Sri G. Veerayya
100. Sri N. Venkiah
101. Sri K. Venkataramanayya
102. Sri Nachu Venkatramayya
103. Sri T. N. Venkata Subba Reddi
104. Sri Pala Venkata Subbayya
105. Sri G. Narasimha Murthy
106. Sri E. Venkatrama Narasayya

107. Sri Venkatrama Reddi
108. Sri Chinnappa
109. Sri Madhava Rao
110. Sri J. T. Fernandez

Noes—42

1. Sri P. Narasinga Rao.
2. Sri G. Ganga Reddi.
3. Sri B. Sreerama Murthy.
4. Sri K. V. S. Padmanabha Raju.
5. Sri K. Rajmallu.
6. Sri R. Narayana Reddi.
7. Sri P. Sundarayya.
8. Sri P. Venkateswarlu.
9. Sri Ch. Rajeswara Rao.
10. Sri K. L. Narasimha Rao.
11. Sri S. Vemayya.
12. Sri G. Yellamanda Reddi.
13. Sri S. Kasi Reddi.
14. Sri V. Visweswara Rao.
15. Smt. A. Kamala Devi.
16. Sri D. Narasayya.
17. Sri C. Venkata Reddi.
18. Sri K. Ramachandra Reddi.
19. Sri B. Dharma Bhiksham.
20. Sri L. Venkata Reddi.
21. Sri N. Peddanna.
22. Sri Uppala Malsoor.
23. Sri S. V. K. Prasada Rao
24. Sri S. Rajeswara Rao.
25. Sri Anantha Reddi.
26. Sri Ranganatha Rao.
27. Sri Amritlal Shukla.
28. Sri K. Narasiah.
29. Sri B. Narasimha Reddi.
30. Sri T. Lakshminarayana Reddi.
31. Sri J. Ananda Rao.
32. Sri G. Lakshma Reddi.
33. Sri Polasani Chokka Rao.
34. Sri A. Venkata Rama Raju.
35. Sri G. Nagseswara Rao.
36. Sri Md. Tahseel
37. Sri B. Audinarayana.
38. Sri Mohan Reddi.
39. Sri Vavilala Gopalakrishnayya.

40. Sri Muthiam Reddi.
41. Sri C. V. Somayajulu.
42. Sri B. Manaiah.

The motion was adopted.

*Mr. Speaker*: The House now stands adjourned till 8-30 A. M. tomorrow.

*The House then adjourned till Half Past Eight of the Clock on Wednesday, the* 31*st July* 1957.

*